# చందమామ

## లీప్ (అధిక) సంవత్సరం (2008)లో
## మరో ముందడుగు!

జనవరి చందమామ ఎక్కువ పేజీలతో
నూతన సంవత్సర సంచికగా వెలువడుతోంది!

ఈ సంచిక ప్రత్యేక విశేషాలు:

- ''నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను'' పోటీలో బహుమతులు గెలుపొందిన రచనలు/వర్ణచిత్రాలు ఈ సంచికలో ప్రచురింపబడతాయి.
- ఒలింపిక్ క్రీడల గురించిన కొత్త శీర్షిక ప్రారంభం.
- ఒలింపిక్ 1896-2004 ప్రపంచ రికార్డులు.
- ప్రస్తుతం వస్తున్న శీర్షికలతో పాటు మరిన్ని కథలు, కార్యకలాపాలు.

మీకాపీ కోసం ఇప్పుడే మీ న్యూస్ ఏజెంట్ వద్ద రిజర్వు చేసుకోండి.
లేదా రూ. **180** చెల్లించి (తపాలా ఉచితం) సంవత్సర చందాదారుగా చేరండి.
మరిన్ని వివరాలకు డిసెంబర్ **2007** సంచిక చూడండి.

**CHANDAMAMA INDIA LTD.**, JVL Plaza Building, 6th Floor,
No. 626 (Old No. 501), Anna Salai, Teynampet,
Chennai - 600 018. Phone : 32402323
e-mail : chandamama@vsnl.com



## నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను

**6-10** తరగతులలో చదువుతున్న విద్యార్థులకు
అఖిలభారత పోటీ. పోటీలో పాల్గొనే పాఠకుల
కోరిక మేరకు ఎంట్రీలు మాకు



## చేరవలసిన ఆఖరు తేదీ
## నవంబర్ 10, 2007 వరకు పొడిగించబడింది.

ఎంట్రీలను పాఠశాల ద్వారానే పంపాలి. వివరాలకు, ఎంట్రీ కూపన్‌కు
చందమామ అక్టోబర్ **2007** సంచిక చూడండి.



చందమామ సంపుటి: 60 నవంబర్ 2007 సంచిక: 11

## ఈ నెల విశేషాలు



















వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

తమ స్వార్థాన్ని విడిచి పరోపకారం చేసేవారు సత్పురుషులు; తమ పనులకు భంగం రాకుండా ఇతరులకు ఉపకారం చేసేవారు సామాన్యులు; తమ లాభం కోసం ఇతరులకు నష్టం కలిగించేవారు నరరూప రాక్షసులు; తమకు లాభం లేకపోయినా ఇతరులకు చెరుపు చేసేవారిని ఏమనాలో తెలియదు!

## ఈ సంచికలో...







# చారిత్రక వాస్తవికతకు మించిన సత్యం!

దేశమంటే ఒక్క భూభాగం మాత్రమే కాదు; సంస్కృతీ సంపన్నులైన మనుషులు కూడా. మనుషులు సంస్కృతీ సంపన్నులుగా పరిణమించడానికి వేనవేల సంవత్సరాలు పడతాయి. పురాతనమైన మనదేశంలో వేలాది సంవత్సరాలుగా సంస్కృతీ సంప్రదాయాలు అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నాయి. అందుకు పురాణేతిహాసాలు, కావ్యాలు, కళలు, మహాపురుషుల జీవితాలు, వారు ప్రబోధించిన ఆదర్శాలు ఎంతగానో దోహదం చేశాయి. ముఖ్యంగా రామాయణ మహాభారతాలు చూపిన ప్రభావం అనన్య సామాన్యమైనది. కావ్యాలుగా, నాటకాలుగా, పాటలుగా, పద్యాలుగా, జానపద గీతాలుగా వాటిని చదివి, విని, పాడి, చూసి, వాటిలోని పాత్రలు నవ్వినప్పుడు నవ్వి, ఏడ్చినప్పుడు కంట తడిపెట్టి–వాటితో మమేకమవుతూ వస్తూన్న జాతి మనది. సామాన్యప్రజలు వాటిలోని పాత్రలను మంచి చెడులకు సజీవ సంకేతాలుగా పరిగణిస్తున్నారు.

సంప్రదాయాలకు మూలకందాలుగా సుదీర్ఘకాలం భావించబడిన వాటిని వాస్తవంగా స్వీకరించాలన్నది అంగీకరించబడిన ఆధారసూత్రం. రాముడు, కృష్ణుడు జీవించారని భావించబడే కాలాలకూ ఇప్పటికీ మధ్య, యుగాలు గడిచి పోయాయి. ఇప్పుడు వారి జీవితాలకు చారిత్రక ఆధారాలను వెతకడం వల్ల ఎలాంటి ప్రయోజనమూ ఒరగబోదు. అది మన పూర్వుల ఆధారాలను వెతికినట్టే ఉంటుంది. సత్యం పట్ల తప్ప చారిత్రక ఆధారాల పట్ల అంతగా ఆసక్తి కనబరచని సంప్రదాయం మనది!

బాధ్యతాయుతమైన పదవులలో ఉన్నవారు అలాంటి పురాణ పురుషులు జీవించినట్టు చారిత్రక ఆధారాలు లేవు అంటే–ప్రశాంత జన జీవనానికి భంగం కలిగించినవారే అవుతారు. పక్షపాత వైఖరితో కూడుకున్న అలాంటి వాస్తవికవాదాలను పట్టించుకోక పోవడమే ఉత్తమం! చారిత్రక వాస్తవికతకు మించిన మహత్తర వాస్తవికత ఉందన్న విషయం మరిచిపోకూడదు!

సంపాదకుడు : **విశ్వం**














చందమామ

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్
ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.

**ఉత్తమ లేఖకు బహుమతి!**
అక్టోబర్ సంచిక నుంచి 'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం. -సం.

**SUBSCRIPTION**
**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
**CHANDAMAMA INDIA LIMITED**
**82, Defence Officers Colony**
**Ekkatuthangal,**
**Chennai - 600 032**
**E-mail :**
**subscription@chandamama.org**





# పాఠకుల లేఖలు

## రూ. 250/- బహుమతి పొందిన లేఖ

కథల్లో 'కమనీయత'! కథానుగుణచిత్ర 'రమణీయత'! శీర్షికల్లో 'నవ్యత'! ముద్రణలో 'ముగ్ధత'! ముఖపత్ర 'రమ్యత'! వెరశి వెలకు మించిన 'యోగ్యత'! ఇతర పత్రికలతో పోల్చలేని 'ప్రత్యేకత'! చందమామ 'విశిష్టత'!-అనేది సర్వజనవిదితం. నిరూపిత సత్యం!

గత 6 0 సం.లుగా ఉన్నతమైనవిలువలను, ప్రమాణాలను పరిరక్షించుకుంటూ, నాటి నుంచి నేటి వరకు పాఠకుల 'పఠనాభిలాష'ను ఏమాత్రం తగ్గనీయకుండా, ప్రవాసాంధ్రులను, సైతం ఆకట్టుకొనేరీతిలో పత్రికానిర్వహణలో ఉదాత్తతను పాటించడం అభినందనీయం!

ప్రతి కథలో 'వినోదం'తోబాటు 'సందేశం' కూడా అంతర్లీనంగా వుండటం మరో మెచ్చదగిన విషయం. 'సెప్టెంబర్' సంచికలోని 'దివాణం నౌకరీ' కథ 'ఎదుటివారి క్షేమంలోనే మనక్షేమం ఇమిడివుంది' అనే ప్రగతిశీల సందేశాన్నందిస్తే, 'జ్ఞానోదయం' కథ 'కృతఘ్నతకన్న మరో మహాపాతకం లేదు' అని ప్రబోధిస్తుంది. 'రాకాసిలోయ' 'బేతాళకథలు' ఉత్కంఠతతో బాటు 'ఉత్సుకత'ను ఉసిగొల్పేరీతిలో వున్నాయి. 'బీర్బల్ కథలు' ఎంతగానో నవ్విస్తే 'రామాయణం' ఆధ్యాత్మిక చైతన్యాన్ని పురిగొల్పుతోంది. నేటి తరానికి తెలియని 2 5 ఏళ్ళనాటి చందమామ కథ 'వెర్రి వెంగళప్ప' 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అనే సూక్తిని తలపింపచేస్తోంది. 'ఫోటో వ్యాఖ్యలపోటీ-ఇండియా క్విజ్' పాఠకుల మేధస్సును పెంచే స్థాయిలోవున్నాయి. 'ఉసిరిక ఔషధగుణాలు' వంటి సర్వజనోపయుక్తమైన 'విజ్ఞానవీచికలు' మరియు 'వారసత్వ ప్రదేశాలు' శీర్షికల ద్వారా ఎన్నో తెలియని విషయాలు తెలుసుకోగలిగాం. ఆయా నెలల్లో వచ్చే 'పండుగల పరమార్థం' అనే పేరుతో మన సంస్కృతీ సంప్రదాలను వివరించే వైశిష్ట్య శీర్షికను అందిస్తే బాగుంటుందని నా సూచన!

-జి.విశాలి, కోట - **524 411,** నెల్లూరు జిల్లా

చందమామను చదువుతూంటే, 'ఆ చందమామ' దగ్గరికెళ్ళి ఈ చందమామను తెచ్చుకున్నంత ఆనందంగా వుంటుంది నాకు. చందమామలో వేసే బొమ్మలకు 5 0 % పిల్లలు ఆకర్షితులయ్యేట్టు వుంటాయి. కథలలో చందమామదే మంచి స్టాండర్డ్. ఆద్యంతం చదివేంత ఆసక్తిగావుంటాయి.

ఇకసున్నితంగా కథల రూపంలో పిల్లలకు మంచి, చెడులను బోధించగల ఒక మంచి తల్లిని గుర్తుకు తెస్తుంది. ఒక మంచి ఉపాధ్యాయినిలాగా వాళ్ళకు నిత్యజీవితంలోని చిన్న చిన్న సమస్యల నుంచి బయటపడే మార్గాన్ని, సూచిస్తూ వినోదాన్ని, విజ్ఞానాన్ని అందిస్తోంది. మారాం చేసే పిల్లలను మంచి మార్గంలో పెట్టాలంటే వాళ్ళకు చందమామ ఇచ్చి, చదవటం అలవాటు చేయాన్నది నా ఉద్దేశ్యం. -జి. శ్యామల, జాగర్లమూడి, గుంటూరు జిల్లా



# రాజుగారికోతి

నక్కవానిపాలెంలో నటేశం అనే కోతులాడించే వాడు ఉండేవాడు. భార్యతో కలిసి వాడు సిరి పురం జమీలోని గ్రామ గ్రామాన తిరుగుతూ కోతుల నాడిస్తూ జీవనం గడిపేవాడు. వాడి దగ్గర ఒక మగకోతి, ఒక ఆడకోతి ఉండేవి. అవి వింత వింత విన్యాసాలతో, చిలిపి పను లతో ప్రజలను ఆకట్టుకుని, చివరలో ఒకచిప్ప పట్టుకుని డబ్బులిమ్మని అడగడం జనానికి సరదాగా ఉండేది. నటేశానికి ఆటచివర నాలుగు డబ్బులు లభించడంవల్ల తిండికి లోటు లేకుండా గడిచిపోతున్నది. ఎప్పటి కైనా తన కోతులాట ద్వారా జమీందారును మెప్పించి ఆయన చేత సన్మానం పొంది, మాన్యం సంపాదించాలన్నది వాడి ఆశ.

వానాకాలం సమీపించే సరికి, నటేశం కోతులాట ముగించుకుని, సామానంతా గాడిద మీద వేసుకుని, కోతులను భుజాల మీదికి ఎక్కించుకుని, మజిలీలు చేస్తూ నక్కవాని పాలెం సమీపించాడు. వాడు ఊళ్ళోకి వచ్చే లోగా చీకటిపడి, అప్పటికే వాన ప్రారంభ మయింది. వాడు గాడిద మీదున్న సామా నంతా దాపుల కనిపించిన ఆంజనేయ స్వామి వారి గుడి అరుగు మీదికి చేర్చి, గాడిదను వానలోనే వదిలేసి, కోతులతో సహా, భార్యతో కలిసి అరుగు మీదికి చేరాడు. అప్పుడే గుడి తలుపులు మూస్తున్న పూజారి, ''ఎక్కడెక్కడో తిరిగి వచ్చి, గుడి అరుగులు మైలచేయ కండి, వెళ్ళండి,'' అని కసిరాడు.

అంతలో ఆడకోతి పూజారి ఎదుటికివచ్చి, రెండు కాళ్ళపై నిలబడి చేతులు జోడించింది. పూజారి దాన్ని కాస్సేపు పరిశీనలగా చూసి నటే శంతో, ''ఒరేయ్, దీని వాలకం చూస్తూంటే ప్రసవ వేదన పడుతున్నట్టున్నది. ఆంజనేయ స్వామి ప్రతిమను పూజిస్తూ, దీని మూగ

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



అంజనేయస్వామికి ప్రతిరూపాలు. నేను ఇంతవరకు మనిషి జాతకాలు వేశాను తప్ప, జంతువులకు వేయలేదు. అయినా, అంజ నేయస్వామికి నమస్కరించి, దీని జనన సమయాన్ని బట్టి లెక్క కడతానుండు,'' అంటూ వేళ్ళతో లెక్క కట్టి, ''ఇప్పుడు పుట్టిన కోతిపిల్ల జనన సమయాన్ని బట్టి చూస్తే మామూలు కోతి పిల్లలాగా ప్రవర్తించదు. ఇది ఎవరినైనా యాచించిందంటే వారు మహారాజు అంశ కలిగినవారుగా ఉంటారు. దీని కారణంగా మీ జీవితాలు ఉన్నత స్థితికి రాగలవని నాకనిపిస్తున్నది,'' అన్నాడు.

నటేశం బుల్లికోతిని చేతిలోకి తీసుకుంటూ, ''చెప్పినట్టు ఇది నాలుగు విద్యలు నేర్చుకుని, జమీందారుగారి నాకర్షిస్తే నాకు కోతి మాన్యం దొరికి, ఇదే ఊళ్ళో స్థిరుడాలని ఉన్నది. మీ దీవన, హనుమంతులవారి దయ ఫలించాలని కోరుకుంటున్నాను,'' అని పూజారి వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

రోజులు గడిచే కొలది ఆటలు నేర్చుకుని ఒకయేడాది తిరిగే సరికి బుల్లికోతి జనాన్ని ఆకర్షించడం మొదలు పెట్టింది. అయితే, అదేం చిత్రమోగాని, అది తల్లికోతి, తండ్రి కోతిలాగ చిప్ప పుచ్చుకుని ఎవరినీ చిల్లర డబ్బులు అడిగేది కాదు. ఇచ్చినా పుచ్చుకునేది కాదు. ఆట అయిపోగానే, కాలు మీద కాలువేసుకుని పడుకోవడం నటేశం దానికి నేర్పాడు. నటేశం నవ్వుతూ, ''బాబూ! దీని జాతకం చాలా గొప్పది. మహారాజు అంశ కలవారిని తప్ప యాచించదు,'' అనేవాడు.

అభ్యర్థనను మన్నించకపోతే, మనిషిగా నా జన్మకు అర్థంలేదు. మీరు ఇక్కడే ఉండండి. వెళ్ళకండి. దీనికిక్కడ పిల్ల పుట్టడం స్వామి వారి లీలగా భావిస్తాను,'' అన్నాడు ఎంతో కనికరంతో.

ఆయన ఊహించినట్టుగానే ఆడకోతి నిమిషాల్లో మగ కోతిపిల్లను కన్నది. వాన తగ్గి నటేశం అరుగులు శుభ్రంచేస్తూంటే, మగకోతి పూజారి ఎదుటికి వెళ్ళి రెండు కాళ్ళ మీద నిలబడి నమస్కరించి పక్కకు తప్పుకున్నది. దానిని గమనించిన నటేశం భార్య పూజారితో, ''అయ్యవారూ! ఈ మగకోతి తనకు పుట్టిన కొడును భవిష్యత్తు తెలుసుకోవాలని దణ్ణం పెడుతున్నట్టుంది,'' అన్నది నవ్వుతూ.

పూజారి ఏ కళనున్నాడో ఏ మోమరి. ''దీన్ని కోతిచేష్ట అని కొట్టిపారేయకూడదు. కోతులు

ఆట చూడ్డానికి వచ్చిన జనం ఉత్సాహం కొద్దీ దానికి డబ్బు ఇచ్చినా పుచ్చుకునేది కాదు. దాంతో ప్రజలు బుల్లికోతిని రాజుగారి కోతి అని పిలవసాగారు.

ఆ సంగతి ఆనోటా ఈనోటా పడి సిరిపురం జమీందారు చెవిన పడింది. కోతులాడించే వాడు తన కోతిని రాజుగారికోతిగా ప్రచారం చేసుకోవడం ఆయనకు ఆగ్రహం తెప్పించింది. దివానును పిలిచి, ''ఆ కోతులాడించే వాణ్ణి శిక్షించు. లేకుంటే పూర్వజన్మలో అది నా తాత అని చెప్పినా చెబుతాడు,'' అని ఆదేశించాడు.

దివాను భటులను పిలిపించి, రాజుగారి కోతి వెనక ఉన్న కథంతా తెలుసుకుని జమీందారుతో, ''ప్రభూ! పొట్టకూటి కోసం మాటలమ్ముకునే వారిని మనం శిక్షించ కూడదు. ఆ కోతిపిల్ల ఆంజనేయ స్వామి ఆలయం అరుగు మీద పుట్టింది. ప్రజలు దాన్ని అభిమానిస్తున్నారు. దాని జోలికివెళ్ళడం మంచిది కాదు. కావాలంటే అది మహారాజు అంశ కల వారిని మాత్రమే యాచిస్తుందన్న విషయాన్ని మాత్రం పరీక్షించవచ్చు. దివాణంలో నటేశం కోతులాట ఏర్పాటు చేద్దాం. ఎవరికీ అనుమానం రాకుండా తమరు ప్రజల్లో మారు వేషంలో కలిసిపొండి. అతి చిన్న మొత్తాన్ని కోతిపిల్ల కివ్వండి. ఆ మొత్తాన్ని పుచ్చుకుంటే దానికి మహారాజు అంశగలవారిని గుర్తించే శక్తి ఉన్నట్టు; అలా జరగని పక్షంలో నటేశం దంపతులను ఇక మీదట అలా రాజశబ్దాన్ని కోతికి చేరిస్తే శిక్షింప బడగలరని గట్టిగా హెచ్చరిద్దాం,'' అన్నాడు. జమీందారు అందుకు అంగీకరించాడు.



జమీందారు సమక్షంలో తన కోతులాట ప్రదర్శించే అవకాశం లభించినందుకు నటేశం ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. ప్రదర్శన చక్కగా జరిగింది. కాని, కోతులాటను చూడ్డానికి జమీందారు రాకపోవడం తెలిసి నటేశం ఆశాభంగానికి లోనయ్యాడు. అయితే, తామిచ్చినా పుచ్చుకోదా అనే దర్పంతో జమీందారు బంధువులు పెద్ద మొత్తాలను బుల్లి కోతికిచ్చారు. అయితే, కాలు మీద కాలు వేసుకుని పడుకుని పుచ్చుకోకుండా అలాగే చూస్తూన్న దాని దర్జాకు ముచ్చటపడి, "ఇది నిజంగా రాజుగారికోతే!" అంటూ అందరూ నవ్వుకోసాగారు.

అప్పుడు జనం నుంచి గుబురు గడ్డం మీసాలుగల సామాన్యుడివేషంలో వున్న జమీందారు ముందుకు వచ్చి అతి చిన్న మొత్తాన్ని కోతిపిల్ల మీదికి విసిరాడు. అంతే, ఆ కోతిపిల్ల చెంగున లేచి, ఆ చిల్లరను తీసి కళ్ళకద్దుకుని, మారువేషంలో వున్న జమీందారు వద్దకు వెళ్ళి రెండు కాళ్ళపై నిలబడి చేతులెత్తి మొక్కసాగింది.

ఆయన జమీందారని తెలియగానే ప్రజలు జేజేలు పలికారు. జమీందారు, "ఏనుగులూ, గుర్రాలూ మా మనసెరిగి ప్రవర్తిస్తాయన్నది మాకనుభవమే. అలాగే ఈ కోతికి రాజుగారిని గుర్తించే శక్తి ఉన్నదని అంగీకరిస్తున్నాను. ఇది నిజంగా రాజుగారికోతే! మూగజంతువులను ప్రేమిస్తూ, వాటి శక్తులను మనం ఉపయోగించుకోవాలన్నదే ఈ కోతిపిల్ల మనకిచ్చే సందేశం. మూగప్రాణుల రక్షణకు నేనొక పరిరక్షణ ఉద్యానవనాన్ని ఏర్పాటు చేస్తాను. ఈ ఉద్యానవనంలో రాజుగారి కోతి మహారాజులా స్వేచ్ఛగా తిరుగుతుంది. దీనిని పెంచిన నటేశానికి మాన్యం ఇస్తున్నాను," అన్నాడు.

కోతులను పరిరక్షణ ఉద్యానవనానికి అప్పగించి, నటేశం నక్కవాని పాలెంలో జమీందారు ఇచ్చిన మాన్యంతో సుఖంగా జీవించసాగాడు. పరిరక్షణ ఉద్యానవనంలో ఇతర జంతువులూ, పక్షులూ చేరడంతో రాజుగారి కోతి తన తల్లికోతి, తండ్రికోతితో స్వేచ్ఛగా, హాయిగా జీవించసాగింది.





# మహీపతి సలహా

జయపురానికి చెందిన కేదారయ్యకు ఏదైనా మంచి వ్యాపారం పెట్టి బాగా డబ్బుగడించాలని ఆశ. వివిధ వ్యాపారాలను గురించి అనుభవజ్ఞులను అడిగాడు. వారిలో చాలామంది- జయపురంలో సరైన పూటకూళ్ళ ఇల్లు లేక, వచ్చే వారికి మంచి తిండి దొరకడంలేదనీ, అందువల్ల మంచి పూటకూళ్ళ వ్యాపారం ప్రారంభించమనీ సూచించారు.

జయపురం ముఖ్య రహదారిలో ఒక పెద్ద ఇల్లు తీసుకుని కేదారయ్య పూటకూళ్ళ వ్యాపారం ప్రారంభించాడు. అయినా అనుకున్నంత వ్యాపారం జరగలేదు. ఇద్దరు ముగ్గురు వంటగాళ్ళను మార్చాడు. కాని వ్యాపారం పుంజుకోలేదు. ఏం చేయడమా అని ఆలోచిస్తున్న సమయంలో మైలవరం నుంచి సునందుడనే వంటవాడు పనివెతుక్కుంటూ వచ్చాడు.

సునందుడు వంటవాడుగా చేరినప్పటి నుంచి వంటకాల రుచి అద్భుతంగా ఉండడంతో, భోజనానికి వచ్చేవారి సంఖ్య క్రమక్రమంగా పెరగసాగింది. రుచి, శుచి రెండూ ఉండడంతో వ్యాపారం పూటపూటకూ అభివృద్ధి చెందసాగింది. కేదారయ్య పూటకూళ్ళ ఇల్లు కొన్నాళ్ళకే జయపురంలో మంచి పేరు తెచ్చుకున్నది.

ఇలా వుండగా ఒకనాడు ఏదో ముఖ్య అవసరం ఏర్పడి, సునందుడు కేదారయ్యను వందవరహాలు అప్పు అడిగాడు. ఇప్పుడు వంద వరహాలు ఇస్తే, మరలా వెయ్యి వరహాలు అప్పు అడగగలడని భావించిన కేదారయ్య లేదనేశాడు.

ఆ రోజునుంచే వంటకాల రుచి లోపించసాగింది. భోజనానికి వచ్చే వారి సంఖ్య కూడా తగ్గసాగింది. రోజూ భోజనం చేయడానికి వచ్చే

కంచనపల్లి వేంకటకృష్ణారావు

మహీపతి అనే ఉపాధ్యాయుడు కూడా రుచి లోపించడం గమనించి, ''ఈ మధ్య వంటలు మునుపటిలా అంత బావుండడం లేదు ఎందుకని?'' అని అడిగాడు కేదారయ్యను.

''అదే నాకూ అంతుబట్టడం లేదు పంతులుగారూ. వంట సరుకులూ అదే చోట కొంటున్నాం. ఎప్పుడూ వంటచేసే సునందుడే ఇప్పుడు కూడా చేస్తున్నాడు,'' అన్నాడు కేదారయ్య విచారంగా.

మహీపతి కొంతసేపు ఆలోచించి, ''సునందుడు నిన్నేదైనా సాయం కోరాడా?'' అని అడిగాడు.

కేదారయ్య ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నట్టు, ''అవును, పంతులుగారూ. సునందుడు వంద వరహాలు అప్పు అడిగాడు. నేను ఇవ్వలేదు,'' అన్నాడు.

''ఎందుకు ఇవ్వలేదు?'' అని అడిగాడు మహీపతి.

''ఒకసారి ఇస్తే అదే అలవాటవుతుందని భావించాను,'' అన్నాడు కేదారయ్య.

''అలా ఎందుకు అనుకోవాలి? అన్నిటికీ ఒకే సూత్రం పాటిస్తే ఎలా? ఒక్కొక్క వ్యాపారం ఒక్కొక్క విధంగా ఉంటుంది గనక, ఆయా వ్యాపారాలకు తగ్గ సూత్రాలనే పాటించాలి. అతడు ఏ అవసరంలో ఉండి అడిగాడో ఏమో! దాని మీది బాధతో చేసే వంట మీద శ్రద్ధ కనబరచలేక పోవచ్చు. నీ దగ్గర పనిచేస్తూ వేరొక చోటికి వెళ్ళి సాయం అర్థించలేడు కదా? ఇంతకూ అతడు అడిగింది అప్పుగానే కదా? వెంటనే వంద వరహాలు ఇచ్చి చూడు. ఫలితం నీకే తెలుస్తుంది. మన దగ్గర పని చేసే వాళ్ళను మంచిగా చూస్తేనే, వాళ్ళ దగ్గరి నుంచి ఆశించిన పనిని రాబట్టగలం,'' అని సలహా ఇచ్చాడు మహీపతి.

కేదారయ్య ఆ రోజే సునందుడికి వంద వరహాలు ఇచ్చాడు. ఆ క్షణం నుంచి సునందుడి ముఖంలో ఆనందం, పనుల్లో ఉత్సాహం కనిపించాయి. వంటలు అద్భుతంగా ఉన్నాయని భోజనానికి వచ్చినవాళ్ళు మెచ్చుకోసాగారు. వ్యాపారం మునుపటి కన్నా ఎక్కువ అభివృద్ధి చెందింది.





# రాకాసిలోయ

## 27

[కేశవుడూ అతడి అనుచరులూ నిప్పులు కక్కే సింహం గుహ ప్రవేశించారు. వాళ్ళకు రాతిగద, మనిషిపుర్రె కనిపించాయి. సింహం మీదికి రాగా గోమాంగ్ దానిని రాతిగదతో బలంగా కొట్టాడు. అది భయపడిపోయి గుహవిడిచి, రెక్కల మనుషులూ, బ్రహ్మదండి మాంత్రికుడూ వున్న ప్రదేశం కేసి పరిగెత్తసాగింది. బయలు ప్రదేశంలో బ్రహ్మదండి హుం ఫట్ అంటూ అరవసాగాడు. -తరవాత]

బ్రహ్మదండి పెట్టేకేకలతో, రెక్కలమనుషులు చెల్లాచెదరుగా పారిపోతూ, ప్రాణభీతితో అరిచే అరుపులతో, మైదాన ప్రదేశమంతా దద్దరిల్లి పోయింది. నిప్పులు కక్కే సింహం మాత్రం రెక్కలమనుషుల జోలికి పోక, అల్లంత దూరంలోవున్న అడవి కేసి సూటిగా పరిగెత్తసాగింది.

సింహం బాగా బెదిరిపోయిందనీ, అది తన ప్రాణరక్షణకు అడవి కేసి పారిపోతున్నదనీ ముందుగా గ్రహించినవాడు, బ్రహ్మదండి మాంత్రికుడు. ఆ వెంటనే అతడు మంత్ర దండాన్ని సింహం కేసి ఝళిపిస్తూ, "జై కాలభైరవా! ఫట్ ఘట్ హుం... సింహాన్ని చెవులు పట్టుకుని, అడవిలోకి లాగెయ్, ఉపాసకుల ఊడల మర్రీ!" అంటూ ఒక పెనుకేక పెట్టి, "హేయ్, జితా, శక్తీ! మీ రెక్కడ? రండి, రండి, భయం లేదు. సింహాన్ని కాననం లోకి తరిమేస్తున్నాను," అంటూ తన అంగ

'చందమామ'



కేశవుడి జుట్టు మన చేతికి దొరికినట్టే!'' అన్నాడు.

కేశవుడి పేరు వింటూనే జితశక్తివర్మలు ఉలిక్కిపడి చుట్టూ కలయ చూస్తూ, ''కేశవుడా? ఎక్కడ?'' అంటూ బ్రహ్మదండి కేసి అనుమానంగా చూశారు.

బ్రహ్మదండిమాంత్రికుడు ఏమాత్రం తొణక్కుండా, ''జితా, శక్తీ! మీరు తొందర పడకండి! వాడెక్కడో ఈ ప్రాంతాలనే తన అనుచరులతో తిరుగుతున్నాడు. మనం జాగ్రత్తగా తిరుగులేని పథకం ఒకటి వేసి వాళ్ళందర్నీ పట్టేయాలి? ముందు నేను చెప్పిన పని చెయ్యండి,'' అన్నాడు.

జిత, శక్తివర్మలు వెళ్ళేసరికి రెక్కల మనుషుల నాయకుడు తన అనుచరులందర్నీ ఒక చోటుకు చేర్చి, వాళ్ళు సింహాన్ని చూసి అంతగా హడలి చెల్లా చెదరైనందుకు కేకలు వేస్తున్నాడు: ''మనది గరుడ వంశం! మన శక్తికీ, ధాటికీ ఈ లోకంలో తిరుగు లేదు. మన వంశం వాళ్ళు తప్ప, ఆకాశంలోకి పక్షిలా ఎగర గలిగిన వాళ్ళు ఇంకెవరున్నారు? ఆ నిప్పులు కక్కే సింహాన్ని మీరు ఎగిరి వెళ్ళి, గరుడపక్షి సర్పాన్ని తన్నినట్టుగా తన్ని ముక్కలు ముక్కలు చేయవలిసింది. అది చేయకపోగా పిరికివాళ్ళలా పారిపోతున్నారు!'' అంటున్నాడు వాడు.

జిత, శక్తివర్మలు అతణ్ణి సమీపించి బ్రహ్మదండి అతడి కోసం ఎదురు చూస్తున్నట్టు తెలియపరిచారు. బ్రహ్మదండి పేరు వింటూనే రెక్కల మనుషుల నాయకుడు, ముఖం కందగడ్డలా చేసుకుని, ''మీ బ్రహ్మదండి మాంత్రి

రక్షకులను పిలిచాడు. కేక వింటూనే జిత, శక్తివర్మలు ఒక చెట్టు చాటు నుంచి తొంగి చూసి, నిప్పులు కక్కే సింహం అరణ్యం కేసి దౌడు దీస్తున్నదని గ్రహించి, కత్తులు దూసి, గిరగిరా తిప్పుతూ, ''ఆ వచ్చాం, వచ్చాం, బ్రహ్మదండీ! సింహం మా కత్తి వేటుకు అందకుండా తప్పుకున్నది. అరణ్యంలోకి జొరబడి దాన్ని వేటాడమంటావా?'' అని అడిగారు.

బ్రహ్మదండి పెద్దగా నవ్వుతూ, ''మీ ధైర్య సాహసాలు నాకు తెలియనివా? అయినా, సింహాన్ని ఇప్పుడు అరణ్యంలోకి వెళ్ళి వేటాడటం క్షేమం కాదు. ముందు రెక్కల పురుగు గాళ్ళకు ధైర్యం చెప్పి మందవేయటం అవసరం. వాళ్ళ నాయకుడు... ఆ గూబముఖం వెధవ ఎక్కడ? వాణ్ణి వెంటనే ఇక్కడికి పిలుచుకు రండి, లేకపోతే నేనే వాడున్న చోటుకు వస్తాను. నా అనుమానం రూఢి అయింది! ఆ

కుడంటే నాకు అపనమ్మకం కలుగుతున్నది. తన మంత్రశక్తితో ప్రతిదాన్నీ భస్మం చేయగల నని చెపుతూంటాడే, ఆ సింహాన్ని ఎందుకని భస్మం చేయలేదు? అది అరణ్యంలోకి పారిపోయింది. అది ఏ క్షణాన్నయినా తిరిగి వచ్చి, మావాళ్ళ వ్యాయామ క్రీడల్ని పాడు చేయవచ్చు,'' అన్నాడు కోపంగా.

జిత, శక్తివర్మలు వంగి వంగి దణ్ణాలు పెడుతూ, ''ఆ నిప్పులు కక్కే సింహం కంటే కూడా ప్రమాదకరులైన వాళ్ళ వల్ల మనకు కీడు రానున్నది,'' అని చెప్పారు.

రెక్కల మనుషుల నాయకుడు తలకు తగిలించుకున్న గద్దముక్క కుళాయిని ఒక సారి పైకెత్తి, ''మనకు కీడు రానున్నదా? ఎవర్నించి? ఆ బిడాలీ, శ్వానకర్ణి ముఠాలు ఏకమై మన మీదికి దండు రావటం లేదు గదా?'' అన్నాడు కొంచెం బెదురుగా.

''ఆ వివరాలు మాకు తెలియవు. మీరొక్క సారి దయచేయండి. సర్వం బ్రహ్మదండి ఎరుకపరుస్తాడు,'' అన్నారు జిత, శక్తివర్మలు.

రెక్కల మనుషుల నాయకుడు బ్రహ్మదండి మాంత్రికుడున్న చోటుకు బయలుదేరాడు. అతణ్ణి అంత దూరాన రావటం చూస్తూనే బ్రహ్మదండి కూచున్న రాతి మీది నుంచి లేచి, అతడికి ఎదురు వెళ్ళి, ''పులుగురాయా! దయ చేయండి, దయ చేయండి,'' అంటూ ఆహ్వానించాడు.

పులుగురాయా, అన్న పిలుపుతో ఉబ్బి పోయిన రెక్కల మనుషుల నాయకుడు, బ్రహ్మదండిని సమీపిస్తూ పెద్దగా నవ్వుతూ, ''బ్రహ్మదండీ, ఏమిటి మనకు రానున్న



కీడు? నీ వాలకం చూస్తే, అలాంటి ప్రమాదం ఏమీ వున్నట్టు లేదే,'' అన్నాడు.

''కీడా? అలాంటిదేమీ లేకపోగా, మనకు గొప్ప మేలు కలిగే లక్షణాలు కనబడుతు న్నవి. అడవిలో నీ అనుచరుల నుంచి దేవ తకు బలి ఇవ్వనున్న ఇద్దరు గుహావాసులను విడిపించిన ద్రోహుల ముఠా, ఆ కొండ గుహల్లో ఎక్కడో దాగి వున్నదని, నాకు గట్టి నమ్మకం కలిగింది. నిప్పులు కక్కే సింహం వెనకా ముందులు చూడకుండా, మన జనాల్లో పడి పారిపోయిన తీరు చూస్తే, ఆ దుర్మార్గులు దాన్ని చంపేందుకు ప్రయత్నిం చారనీ, అది తప్పించుకు పరిగెత్తిందనీ తెలి యటం లేదా?'' అన్నాడు బ్రహ్మదండి ఉత్సా హంగా.

బ్రహ్మదండి ఇలా అనగానే, పులుగు రాయుడు ఎగిరి గంతేసి, ''కేశవుడూ, వాడి



అనుచరులా! ఇంక కావలసిందేమిటి? నాకు అర్ధరాజ్యమూ, నీకు రాకాసిలోయలో వున్న వెండి బంగారాలూ! చూస్తారేం, పదండి, వాళ్ళనిప్పుడే కొండ గాలించి పట్టేద్దాం,'' అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు తనకు ప్రాణా పాయం కలిగినప్పుడల్లా, తనను పట్టుకున్న వాడికి అర్ధరాజ్యం ఇప్పిస్తానని వాగ్దానం చేశాడు. చండమండూకుడి నుంచి బయట పడేందుకు అతడికీ, తరవాత రెక్కల మను షుల నాయకుడైన పులుగురాయుడికి దొరికి అతడికీ, మీకు అర్ధరాజ్యం వస్తుందని మాట ఇచ్చేశాడు. పైగా, చండమండూకుడి నర మాంస భక్షకులకు దొరికిన స్థూలకాయుణ్ణి, తనకు తోడుగా వుంటాడని చెప్పి, మండూ కుణ్ణించి ఆ బానిస యజమానిని కాపాడి, తన వెంట తెచ్చుకున్నాడు.

పులుగురాయుడి తొందరపాటు చూసి బ్రహ్మదండి మాంత్రికుడు ముఖం చిట్లించి, ''పులుగురాయా, ఇది వేగిరపాటుకు సమయం కాదు. కేశవుడూ, అతడి వెంట వున్న జయమల్లూ, కోయవాడూ మహా జిత్తులమారి వెధవలు. మనం ఒక్కుమ్మడిగా కొండగుహల కేసి వెళితే, వాళ్ళు గుహకంద రాల్లోపడి మనకు చిక్కకుండా పారిపోగలరు. వాళ్ళను గుహలు విడిచి వచ్చేలా చేయాలి. అప్పుడు మనం వాళ్ళను చేజిక్కించుకో వచ్చు,'' అన్నాడు.

''అదెలా సాధ్యం? నువ్వు చెప్పేదాన్ని బట్టి చూస్తే వాళ్ళేమీ అమాయకులు కారే,'' అన్నాడు పులుగురాయుడు.

''వాళ్ళ జిత్తులమారి తనాన్ని, కాలభైరవుడి కరుణాకటాక్షం వల్ల నేను జయిస్తాను. దానికి మన స్థూలకాయుడు... ఆ బానిస యజ మాని వున్నాడే...వాడి సహాయం అవసరం. ఆ మాంసంపోగును పిలిపించండి,'' అన్నాడు బ్రహ్మదండి. వెంటనే పులుగురాయుడు తన అనుచరులను బానిస యజమాని కోసం పంపాడు. ఈ లోపల బ్రహ్మదండి, తన అంగరక్షకులైన జిత, శక్తివర్మలతో బయలు దేరి, కొంతదూరం వెళ్ళి, చెట్ల చాటున వున్న ఒక గుడిశె ముందు నిలబడ్డాడు.

''నీ ఎత్తుగడ ఏమిటి బ్రహ్మదండీ? మళ్ళీ ఏదో కొంప మీదికి తెచ్చేట్టున్నావు. ఆ మహా కాయుడికి ఎలాంటి పని ఒప్పచెప్ప బోతు న్నావు?'' అని అడిగాడు జితవర్మ.

''నీ చచ్చు ప్రశ్నలతో నా ఆలోచన చెడ గొట్టకు. ఆ బానిస యజమానిని నరభక్షకులు

తినకుండా కాపాడింది, నేను. ఆ కారణం వల్ల వాడు నా బానిస కింద లెక్క. నేను ఇష్ట మొచ్చిన విధంగా వాణ్ణి ఉపయోగిస్తాను," అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు విసుగ్గా.

"వాడు, నీ బానిస ఎలా అవుతాడు? వాడికీ అర్ధరాజ్యం ఇప్పిస్తానని ప్రమాణం చేశావుగదా?" అని అడిగాడు శక్తివర్మ.

"వాడికి అర్ధరాజ్యం ఇప్పిస్తానని, ప్రమాణం చెయ్యలేదు. అర్ధరాజ్యంలో తనకు నచ్చిన వాళ్ళను బానిసలుగా పట్టుకుపోయి అమ్ము కునే అధికారం ఇస్తానన్నాను," అన్నాడు బ్రహ్మదండి కోపంగా. ఆ సమయంలో పులుగురాయుడు వాళ్ళను సమీపించి, "ఏమిటి, మీలోమీరు పోట్లాడుకుంటున్నా రులా వుంది?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి చప్పున అతడి కేసి తిరిగి చిరునవ్వు నవ్వుతూ, "పోట్లాట కాదు. నా అంగరక్షకులిద్దరూ స్వయంగా కొండ గుహ ల్లోకి వెళ్ళి, ఆ కేశవుడి ముఠాను పట్టు కొస్తామంటున్నారు. నేను తొందరపడవద్దని చెపుతున్నాను," అన్నాడు.

ఆ తరవాత ఒకటి రెండు నిమిషాలకు స్థూలకాయుడు రెక్కల మనుషుల వెంట బ్రహ్మదండి వున్న చోటుకు వచ్చి, "ఏం, మహామాంత్రికా! నాతో కావలసినపనేమిటి?" అంటూ భుజాన వేళ్ళాడుతున్న కొరడా చేతి లోకి తీసుకున్నాడు.

బ్రహ్మదండి, స్థూలకాయుణ్ణి దూరంగా తీసుకుపోయి రహస్యంగా అతడితో కొంత సేపు మాట్లాడాడు. మాంత్రికుడి మాటలకు అతడు మొదట్లో భయం బెదురూ కనబరి




చినా, ఆఖరుకు తృప్తుడైనట్టు ముఖంపెట్టి, కొరడాను పైకెత్తి పెద్దగా ఝళిపించి, కోర మీసాలను మెలివేసి, ఒక రంకె వేశాడు.

బ్రహ్మదండి, పులుగురాయుడి దగ్గిరకు వచ్చి, "పులుగురాయేంద్రా! కేశవుడు ఇక మన అరచేతి అమలకం, తిరుగు లేదు. తమరూ, తమ అనుచరులు కొద్ది మందీ మాతో కలిసి, ఆ రాతి గుట్టలున్న ప్రదేశానికి రండి. స్థూలకాయుడు ఒక నాటకం ఆడ బోతున్నాడు. అంతా ఒక్క నిమిషం పని. వివ రాలు ఇప్పుడడక్కండి," అన్నాడు ప్రాథేయ పడుతున్నట్టు.

ఆ వెంటనే పులుగురాయుడు నలుగు రైదుగురు అనుచరులతో బ్రహ్మదండి చెప్పిన గుట్టల ప్రదేశానికి బయలుదేరాడు. బ్రహ్మ దండీ, జిత శక్తివర్మలు అతణ్ణి అనుసరించారు. స్థూలకాయుడు కొరడాను గాలిలో గిర్రున

తిప్పుతూ, వాళ్ళ వెనగ్గా నడిచి వెళ్ళి, గుట్టలలో వున్న ఒక పెద్ద రాతి మీద ఎక్కి, బ్రహ్మదండి ముఠా దగ్గిరకు రాగానే, వాళ్ళను కొట్టబోతున్న వాడిలా కొరడా ఝుళిపిస్తూ, ''ఏయ్, బ్రహ్మదండీ, జితాశక్తీ, పులుగురాయా! ఇక మీరు నా నుంచి పారిపోలేరు. మిమ్మల్నందర్నీ, ఆ కేశవుడికి అమ్మేస్తాను. అతడి చేతిలో మీకు చిత్రవధ తప్పదు. మీరు చావగానే, ఆ కేశవుడు నిరాటంకంగా రాకాసిలోయకు వెళ్ళి ధనరాసులు తెచ్చుకుంటాడు. నేనూ అతడి వెంట వెళతాను,'' అంటూ కొండలు మార్మోగేలా అరవసాగాడు.

గుహకప్పులో వున్న కంత గుండా ఇదంతా చూస్తున్న కేశవుడికీ, జయమల్లుకూ, కోయ గోమాంగ్‌కూ చాలా ఆశ్చర్యం కలిగింది. మహా క్రూరుడైన స్థూలకాయుడు బతికి వుండటమే గాక, వాడు బ్రహ్మదండినీ వాడి అనుచరులనూ బానిసలుగా పట్టుకున్నాడంటే, వాళ్ళకు నమ్మశక్యం కాకుండా వున్నది.

''కేశవా, ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది,'' అన్నాడు జయమల్లు. కేశవుడు ఏదో జవాబు చెప్ప బోయేంతలో, స్థూలకాయుడు కొరడాను ఠపీ మని ఒకసారి మోగించి, ''ఇక మీరంతా వెళ్ళండి, బ్రహ్మదండీ! జాగర్త, ఆ చీకటి గుడిశె దాటిపోయారో, నా నౌకర్లు మిమ్మల్నందర్నీ నిలువునా కోసేస్తారు,'' అంటూ గావు కేక పెట్టాడు. ఆ తరవాత బ్రహ్మదండీ వాళ్ళు వెళ్ళి పోవటం కేశవుడికీ అతడి అనుచరులకూ కనిపించింది. స్థూలకాయుడు మాత్రం ఇంకా రాతి మీదే నిలబడి కొరడాను గాలిలో తిప్పుతూ ఛెళ్ళు ఛెళ్ళుమనిపిస్తున్నాడు.

''మల్లూ! ఇదే మనకు మంచి అదను. స్థూలకాయుణ్ణి పట్టుకుని అసలు రహస్యమేమిటో తెలుసుకుందాం. ఒకవేళ బ్రహ్మదండీ, రెక్కల మనుషులూ మన మీదికి దాడి చేయవస్తే, తిరిగి ఇదే కంతకుండా గుహలో ప్రవేశించి కనబడకుండా మాయం కావచ్చు,'' అంటూ కేశవుడు కంత నుంచి బయిటికి వచ్చి, నేల మీద పాకుతూ స్థూలకాయుడు నిలబడి వున్న రాతి కేసి బయలుదేరాడు.

జయమల్లూ, కోయగోమాంగ్‌లు కూడా కేశవుడి వెనక చప్పుడు కాకుండా పాకుతూ బయలుదేరారు. -(ఇంకావుంది)






# జన్మవిముక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, దైవజ్ఞులు, జ్యోతిషపండితులమని చెప్పుకునే కొందరు తలాతోకా లేని కారణాలను చూపి, తమను నమ్మినవారిని అవస్థలపాలు చేస్తూ ఉంటారు. భీతి కొలిపే ఈ అరణ్యంలో అపరాత్రివేళ నువ్వు పడుతూన్న శ్రమ చూస్తూంటే, అటువంటి వారెవరో నిన్నీ పనికి పురికొల్పారేమోనన్న అనుమానం కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు, అలాంటి కోవకు చెందిన చలాకుడనే జ్యోతిషపండితుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

బేతాళ కథలు



మహాపురంలో ఉండే దివాకరుడనే భాగ్య వంతుడు తన కూతురు కళావతికి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాడు. ఒకరు కాదు, ఇద్దరు కాదు; వరుసగా పదిమంది యువకు లామెను ఏదో వంక బెట్టి కాదన్నారు. దివా కరుడు బెంగపెట్టుకున్నాడు. ఆయన భార్య ప్రభావతి తన అన్న సుకోపుడికీ విషయం కబురు చేస్తూ, కళావతి జాతకాన్ని కూడా పంపింది.

సుకోపుడు వ్యవహారజ్ఞుడు. జ్యోతిషపండి తుడు చలాకుడు ఆయనకు ప్రాణ స్నేహి తుడు. చెల్లెల నుంచి కబురందగానే, సుకో పుడు కళావతి జాతకాన్ని మిత్రుడికి చూపిం చాడు. చలాకుడది పరీక్షించి, ''ఈ జాతకం జగన్మాత సీతాదేవి జాతకాన్ని పోలి ఉన్నది. అందుకే పెళ్ళి, పిల్లల విషయంలో కొంత ఇబ్బంది ఉంటుంది. జగత్పురం వెళ్ళి, సీతారాముల దర్శనం చేసుకుని, తీసుకున్న ప్రసాదంలో కొంత ఆ ఊళ్ళోని పుణ్యాత్ముల ఇంట ఇస్తే ఈమెకు శుభం జరుగుతుంది. అది ఎంత త్వరగా జరిగితే అంత మంచిది,'' అన్నాడు.

''అంటే, జాతకం ప్రకారం కళావతికి తగిన వరుడు జగత్పురంలో ఉన్నాడనే కదా నీ అభిప్రాయం. అలా అయితే, మనమూ, మా చెల్లెలి కుటుంబమూ కలిసి జగత్పురం వెళదాం. మరి, ఆ ఊళ్ళోని పుణ్యాత్ములెవరో నువ్వే మాకు దగ్గరుండి చూపించాలి,'' అన్నాడు సుకోపుడు.

చలాకుడు సరేననగానే వాళ్ళిద్దరూ కలిసి మహాపురం వెళ్ళారు. విషయం తెలిసిన దివా కరుడు వెంటనే పురుషులకొకటీ, స్త్రీలకొకటీ విడివిడిగా రెండు గుర్రపు బగ్గీలు ఏర్పాటు చేశాడు. ఆ రోజంతా ప్రయాణం చేసి, వాళ్ళు జగత్పురం చేరుకుని దైవదర్శనం చేసుకుని ప్రసాదం తీసుకున్నారు. ఆ సమయంలో చలాకుడు దగ్గరుండి కళావతి చేత దేవీస్తోత్రం పఠింపజేశాడు.

తిరుగు ప్రయాణంలో ఒక ఇంటి సమీపా నికి వచ్చాక, చలాకుడు బండిని ఆపమని సైగ చేశాడు. బండి ఆగాక ఆయన కళావ తితో, ''అమ్మా కళావతీ! ఈ ఇల్లు పుణ్యాత్ముల దని నాకు తోస్తున్నది. నీ దగ్గరున్న ప్రసాదంలో కొంత ఆ ఇంట్లో ఇచ్చిరా,'' అన్నాడు.

ఆయన ఆదేశం ప్రకారం బండి దిగి ఆ ఇంటి గుమ్మంలో అడుగుపెట్టిన కళావతికి

ఇంటి నుంచి వస్తున్న ఒక యువకుడు ఎదురుపడి ఆమెను కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డాడు. ఆ చూపులకు సిగ్గు పడుతూ కళావతి, ''సీతారాముల దర్శనార్థం మహా పురం నుంచి ఈ ఊరొచ్చాం. ఇది పుణ్యాత్ముల ఇల్లనీ, ఇక్కడ దేవుడి ప్రసాదం ఇస్తే నాకు శుభం జరుగుతుందనీ పెద్దలు చెప్పారు. ప్రసాదం తీసుకోండి,'' అంటూ ప్రసాదం అందించబోయింది.

''ఈ ఇంట్లో పుణ్యాత్ములు నా తల్లిదం డ్రులు. ఆ ప్రసాదం వాళ్ళకే ఇవ్వు,'' అంటూ ఆ యువకుడు లోపలికి వెళ్ళి, తల్లిదండ్రు లతో, ''మీకు దేవుడి ప్రసాదమివ్వాలని ఒక యువతి వచ్చింది. మీకామెనచ్చితే నేనామెను దైవప్రసాదంగా భావించి పెళ్ళి చేసుకుం టాను,'' అన్నాడు.

ఆ యువకుడి పేరు వీరభద్రుడు. తండ్రి శివకాముడు, తల్లి శివకామమ్మ. ఇన్నాళ్ళూ పెళ్ళికి ఒప్పుకోని కొడుకు ఇప్పుడు చేసు కుంటాననడం వాళ్ళకు పరమానందం కలి గించింది. వాళ్ళకు కళావతి నచ్చింది. చలా కుడు వధూవరుల జాతకాలు పరిశీలించి చక్కగా కుదిరాయన్నాడు. కళావతికీ, వీర భద్రుడికీ పెళ్ళి నిశ్చయమైపోయింది.

ఆ రోజే తిరుగు ప్రయాణమై, దివాకరుడి కుటుంబం సూర్యాస్తమయం కావడంతో ఆ రాత్రికి మార్గ మధ్యంలోని ఒక సత్రంలో బస చేయవలసి వచ్చింది.

మరునాడు తెల్లవారగానే చలాకుడు సంధ్యావందనం చేయడానికి సత్రానికి కొద్ది



దూరంలో ప్రవహిస్తూన్న నది వద్దకు వెళ్ళాడు. సంధ్యవార్చి గట్టు మీదికి వచ్చి అక్కడున్న మర్రి చెట్టుకింద కూర్చున్నాడు. అప్పుడా చెట్టుపై నుంచి ఒక రాక్షసుడాయన ముందుకు దూకి, ''అడిగినదానికి బదులిచ్చి నా సందేహం తీర్చు. లేదా నాకు ఆహారమై నా ఆకలి తీర్చు,'' అన్నాడు.

చలాకుడు జ్యోతిష పండితుడేగాక లౌక్యుడూ, ధైర్యవంతుడూనూ. రాక్షసుడు అడిగిన తీరును బట్టి ఆయన అసలు సంగతి ఊహించి, ''నీకీ రాక్షసరూపం నుంచి విముక్తి కావాలి. అంతే కదా?'' అన్నాడు.

అది నిజం కావడంతో చలాకుడి మీద రాక్షసుడికి గురి కుదిరింది. వాడాయనకు నమస్కరించి తరుణోపాయం చెప్పమని వేడుకున్నాడు. చలాకుడు వాడికుడి అరచేతిని



శ్రద్ధగా పరీక్షించి, ''నీ దగ్గరున్న ఏదైనా అద్భుత శక్తితో పుణ్యాత్ములకు ఉపకారం చేసిన మరు క్షణమే, నీకీ జన్మ నుంచి విముక్తి కలుగుతుంది,'' అన్నాడు.

''నాకున్న అద్భుతశక్తి ఒకే ఒక మంత్రం మాత్రమే. దానితో పండును మంత్రించి ఇస్తే సంతాన ప్రాప్తి కలుగుతుంది. అయితే, దాన్ని ఒక్కసారి మాత్రమే ఉపయోగించగలను. అయినా, పుణ్యాత్ములకూ, పాపాత్ములకూ భేదం తెలుసుకోలేని జన్మనాది. నువ్వే దాన్ని త్వరగా పుణ్యాత్ములకిచ్చి నా జన్మ విముక్తి కలిగించు,'' అని వేడుకున్నాడు రాక్షసుడు.

''దేనికైనా సమయం రావాలి కదా? జన్మ విముక్తికి నువ్వు మరి కొంత కాలం వేచి ఉండకతప్పదు. మంత్రించినసంతానఫలాన్ని అందుకోగల పుణ్యాత్ములు తారసపడగానే వచ్చి తీసుకుంటాను,'' అని చెప్పి, చలాకుడు అక్కడి నుంచి దివాకరుడు వాళ్ళున్న సత్రానికి వచ్చి, వాళ్ళతో కలిసి తిరుగు ప్రయాణమయ్యాడు.

అ తరవాత అనుకున్న శుభ ముహూర్తంలో కళావతి, వీరభద్రుల వివాహం ఘనంగా జరిగిపోయింది. కాపురానికి వచ్చిన కళావతి అటు భర్తకు అనుకూలవతిగా ఉంటూ, ఇటు అత్తమామలను కన్నకూతురి కంటే ఎక్కువగా సేవిస్తూ ఇంటా బయటా ఎంతో మంచి పేరు తెచ్చుకున్నది.

త్వరగా మనవణ్ణి ఎత్తుకోవాలన్న ఆశతో–అత్తమామలు కళావతి చేత ఎన్నో నోములు, వ్రతాలు చేయించారు. కాని, పెళ్ళయి మూడేళ్ళయినా కళావతికి పిల్లలు పుట్టలేదు.

దీన్ని అవకాశంగా తీసుకుని రామనాథం అనే బంధువు, తన కూతురు సుభద్రను వీరభద్రుడికి కట్టబెట్టాలన్న దురాశతో, పేరిశాస్త్రిని కలుసుకుని, ''నువ్వు శివకాముడి ఇంటికి వెళ్ళి, కళావతికి సంతానయోగం లేదనీ, వీరభద్రుడికి రెండో పెళ్ళి చేయమనీ అతడికి నచ్చజెప్పు. మా సుభద్రను చేసుకుంటే గంపెడు పిల్లలు పుడతారని నమ్మబలుకు. నీ మాట మీద వీరభద్రుడు మా అల్లుడైతే నీకు మంచి బహుమానం ఇస్తాను,'' అన్నాడు.

డబ్బుకు ఆశపడ్డ పేరిశాస్త్రి రామనాథం చెప్పినట్టే చేశాడు. శివకాముడాయన మాటకు లోబడి కొడుక్కు రెండో పెళ్ళి చేయాలనుకున్నాడు. వీరభద్రుడు కూడా అందుకు సుముఖత చూపాడు.

విషయం చలాకుడి వరకు వెళ్ళడంతో ఆయన హుటాహుటిగా జగత్పురం చేరుకుని శివకాముణ్ణి చూసి, అందరి జాతకాలూ పరిశీలించి, "కళావతికి సంతాన యోగం ఉన్నది. అయితే, నువ్వూ, నీ భార్యా, నీ కొడుకూ చేసిన కొన్ని పాపాలు శాపాలై ఆమెకు సంతానం కలక్కుండా అడ్డుకుంటున్నాయి. మీరు మీ పాపాలకు ప్రాయశ్చిత్తంగా రామాలయంలో పూజలు జరిపి, పేదలకు అన్నదానం చేయండి, కళావతికి పండంటి మగబిడ్డ కలుగుతాడు," అన్నాడు.

దానికి శివకాముడు, "మీరు చెప్పినట్టు చేయడానికి మాకెలాంటి అభ్యంతరమూ లేదు. కాని, మా ఊరి పురోహితుడు పేరిశాస్త్రి, కళావతికి సంతానయోగం లేదన్నాడు. తమరా విషయం ఆయనతో చర్చించి నిజం నిర్ధారించవలసి ఉన్నది," అన్నాడు.

పేరిశాస్త్రికి కబురు పెట్టి రప్పిస్తే ఆయన కళావతికి సంతానయోగం లేదని నొక్కి చెప్పాడు. అప్పుడు చలాకుడు, "నీ మాటలు నా జ్యోతిష పాండిత్యాన్ని సవాలు చేస్తున్నాయి. కాబట్టి మనం ఈ విషయమై పందెం వేసుకుందాం. ఓడినవారు జ్యోతిషం చెప్పడం మానేసి గుండుగీయించుకుని చెప్పుల మాల వేసుకుని గాడిద మీద ఈ ఊళ్ళో ఊరేగాలి. అందుకు నేను సిద్ధం. నువ్వు సిద్ధమేనా?" అన్నాడు.

చలాకుడి ముఖంలో కనబడ్డ నమ్మకానికి భయపడ్డ పేరిశాస్త్రి, "జ్యోతిషంలో జరిగేవన్నీ ఖచ్చితంగా చెప్పగలమనుకోవడం మూర్ఖత్వం,"




అంటూ పందెం నుంచి తప్పుకున్నాడు. చలాకుడు మాత్రం ఏ మాత్రం జంకకుండా తన మాట మీద నిలబడ్డాడు. దాంతో శివకాముడు, భార్య, కొడుకు ఆయన చెప్పినట్టు చేయడానికి ఒప్పుకుని, పూజలు, అన్నదానాలకు ఏర్పాటు చేశారు.

అన్నీ సక్రమంగా పూర్తవుతూన్న సమయంలో చలాకుడు వెళ్ళి మర్రి చెట్టు రాక్షసుణ్ణి కలుసుకుని, "నీకు జన్మవిముక్తిలభించే సమయం వచ్చింది," అని చెప్పి వాడి నుంచి మంత్రించిన సంతానఫలాన్ని పుచ్చుకోగానే రాక్షసుడు పెద్దగా అరిచి నేలకొరిగాడు.

చలాకుడు కళావతికి తన వద్దనున్న సంతానఫలాన్నిచ్చి, "ఇప్పుడు నీవిది భుజించు. నీ కడుపు పండి, పండంటి మగబిడ్డ కలుగుతాడు," అని ఆశీర్వదించాడు.

ఆయన చెప్పినట్టే ఏడాదిలోగా కళావతికి మగబిడ్డ కలిగాడు. శివకాముడు చలాకుణ్ణి జగత్పురానికి పిలిచి ఘనంగా సత్కరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కళావతికి వివాహమయినప్పుడే సంతాన ఫలాన్నిచ్చి ఉంటే ఆమెకు కష్టాలు తప్పడంతో పాటు, రాక్షసుడికి మూడేళ్ళు ముందుగానే జన్మవిముక్తి లభించి ఉండేది. చలాకుడు అలా ఎందుకు చేయలేదు? కళావతి సంతానవతి కాకపోయినప్పుడు, చలాకుడు ఆమెకు నేరుగా సంతానఫలం ఇవ్వకుండా ఆమె అత్తమామలనూ, భర్తనూ తప్పు పట్టడం; పరిహారం చేయించడం; భేషజంతో వారిని తప్పుదారి పట్టించడం కాక మరేమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేనికైనా సమయం రావాలని చలాకుడు మొదటే రాక్షసుడికి చెప్పాడు. తొందర పడివుంటే కార్యభంగం జరిగి ఉండేది. జాతకరీత్యా కళావతి సంతానవతి కావడానికీ, రాక్షసుడు జన్మ విముక్తి పొందడానికీ ఇంకా కనీసం మూడేళ్ళ వ్యవధి ఉన్నదని ఆయన గ్రహించి ఉండాలి. అందువల్లే, కళావతికి వివాహమై మూడేళ్ళయ్యాక సంతానఫలం ఇవ్వాలని నిర్ణయించాడు. ఆ సమయంలో భర్త, అత్తమామలు కళావతి సంతానవతి కానందుకు ఆమెను తప్పు పట్టారు. ఆమెకు అన్యాయం తలపెట్టారు. వారికి తగిన బుద్ధి చెప్పాలనే ఆమె సంతానవతి కాకపోవడానికి తప్పు ఆమెది కాదనీ, వారిదనీ నమ్మేలా చేశాడు. ఆమె కథ విన్న ఏ భర్త అయినా, అత్తమామలయినా సంతానవతి కాలేని స్త్రీని తప్పుపట్టడానికి భయపడాలన్న ఆశయంతోనే ఆయన అలా చేశాడు. ఇందులో ఎలాంటి భేషజానికీ తావు లేదు. తగిన సమయంలో సంతానఫలాన్ని రెండు విధాలుగా ఉపయోగించిన చలాకుడు కేవలం జ్యోతిష పండితుడు మాత్రమే కాదు. సమాజ శ్రేయస్సు పట్ల శ్రద్ధాసక్తులుగల మేధావంతుడు అనడంలో సందేహం లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]








## ఎడ్ల పరుగు పందాలు

'బుల్ ఫైటింగ్' స్పెయిన్ జాతీయ క్రీడ. అలాగే ఎడ్ల పరుగు పందాలను ఆ దేశంలో అక్కడక్కడా పండుగలుగా జరుపుకుంటారు. మన దేశంలో కూడా కొన్ని ప్రాంతాలలో ఎడ్ల పరుగు పందాలను పోలిన క్రీడలు పండుగ సందర్భాలలో జరుపుకుంటారు. ఈ క్రీడకు సంబంధించి దాదాపు 2000 సంవత్సరాలకు పూర్వమే రచింప బడ్డ కవితలు ఉండడం విశేషం.తమిళనాడు దక్షిణ ప్రాంతంలో దీనిని 'జల్లిక్కట్టు' అంటారు. ఆబోతుల కొమ్ములకు ఎర్రని బట్టలను చుట్టి, క్రీడామైదానంలోకి తరుముతారు. ఆబోతులు విజృంభించి అటూ ఇటూ పరుగులుతీస్తాయి. సాహసవీరులైన యువకులు ఆ ఆబోతులను నిలువరించి, వాటి కొమ్ములకు చుట్టిన బట్టలను లాక్కోవడానికి ప్రయత్నిస్తారు.

## అలనాటి ఇంద్రప్రస్థం

మహాభారతం చదివిన వారికీ, విన్న వారికీ ఇంద్రప్రస్థం గురించి తెలిసే ఉంటుంది. అది పాండవుల రాజధాని. కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు-తమ్ములు, భార్యతో మహాప్రస్థానానికి వెళ్ళడానికి నిర్ణయించాడు. రాజ్యం శ్రీ కృష్ణుడి మనవడు అనిరుద్ధుడికీ, ఆయన కుమారుడు వజ్రుడికీ అప్పగించబడింది. వజ్రుడి తరవాత ముప్పై తరాల వాళ్ళు ఇంద్రప్రస్థాన్ని పరిపాలించారు. వారిలో చివరివాడు క్షేమకుడు. ఆ తరవాత ఆయన మంత్రి వైసర్వ్యుడు రాజై, ఆయన తరవాత ఆయన వంశస్థులు 500 సంవత్సరాలు పాలించారు. ఇంద్రప్రస్థ శిథిలాల మీదే హుమయూన్ పురాణ ఖిలాను నిర్మించాడు.



# పట్టుబడిన పగడాల దొంగలు!

తెల్లవారక ముందే నిద్రలేచిన అలీ, స్నానం చేసి, టిఫిన్ పూర్తిచేసి పుస్తకాల సంచీతో పాఠశాలకు సిద్ధమయ్యాడు. అండమాన్ దీవిలో అతడి పాఠశాల ఇంటికి రెండు కి.మీ. దూరంలో ఉన్నది. అయితే, గత పదేళ్ళుగా రోజూ అంత దూరం సులభంగానే వెళ్ళి వస్తున్నాడు అలీ. గ్రామం దాటి సముద్ర తీరం గుండా నడిచి వెళితే అతడు చదువుతూన్న పాఠశాల వస్తుంది. అతడు పాఠశాల నుంచి తిరిగి వచ్చేప్పుడు అప్పుడప్పుడూ సముద్ర జలాల అంచుకు వెళ్ళేవాడు. ఒడ్డును సుతారంగా తాకే అలలను ఆసక్తిగా చూసేవాడు. నీళ్ళ అంచున తిరుగాడుతూండే పీతలను వాటి బొరియల్లోకి తరిమేవాడు. గట్టుకు కొట్టుకు వచ్చిన స్టార్‌ఫిష్‌ను వింతగా చూసేవాడు. గవ్వలను ఏరుకునేవాడు.

అయినా, కొన్ని వారాల క్రితం కొందరు పర్యావరణ పరిరక్షణాసంస్థ సభ్యులు వచ్చి అలీ తరగతిలోని విద్యార్థులను సముద్ర తీరానికి తీసుకువెళ్ళి సముద్రంలోని జీవరాశులను గురించి వివరించేంతవరకు, వాటిని గురించి అలీకి అంతగా తెలియదు. వాళ్ళు అలీకీ, అతడి మిత్రులకూ సముద్రంలో నివసించే అసంఖ్యాకమైన ప్రాణులను గురించి వివరించారు. వాటిలో చాలావాటిని చూపారు. 'స్నార్కెల్స్' సాయంతో, పగడాల గుట్టలనూ, అవి జీవించే విధానాన్నీ చూపారు. పగడాలు సజీవ ప్రాణులని తెలుసుకుని విద్యార్థులు విస్తుపోయారు. ప్రాణంలేని పెద్ద పెద్ద బండల్లా కనిపించేవి–తాబేటి చిప్పల్లా లోపలి ప్రాణుల్ని కాపాడే అస్థిపంజరాల్లాంటివని తెలుసుకుని అమితాశ్చర్యం చెందారు. రకరకాల పగడాలను, వాటి చుట్టూ నివసించే పేరట్ ఫిషస్, సముద్రపు అనిమోన్లు, స్టార్‌ఫిష్, కొమ్మచేపలు మొదలైన వాటిని చూసి ఆనందాశ్చర్యాలు పొందారు. అన్నిటికన్నా రంగురంగుల



అలంకరణలతో 'పిక్చర్ బుక్స్'లో చూసినట్టున్న బుల్లి ప్రాణులు 'క్రిస్మస్‌ట్రీస్' అలీని ఎంతగానో ఆకర్షించాయి. అవి పగడాలకు అనుకుని కని పించాయి. వాటిని ముట్టుకోబోతే, ప్రమాదాన్ని గ్రహించినట్టు అవి వెంటనే లోపలికి కుంచిం చుకు పోయాయి!

సముద్రంలో నిక్షిప్తమై ఉన్న సహజ సంప దలను గురించి పర్యావరణ పరిరక్షణ సంస్థ సభ్యులు చెప్పగా విన్న అలీ చాలా గొప్పగా పొంగిపోయాడు. మన దేశంలో ముఖ్యంగా లక్షద్వీప్, కచ్ జలసంధి, మన్నార్ జలసంధి, అండమాన్‌నికోబార్ దీవులలో పగడాల గుట్టలు ఉన్నాయి. అయితే తరచూ వచ్చే పర్యాటకులు తమ ఇళ్ళల్లో అలంకారవస్తువులుగా ఉపయో గించడానికి వాటిని లాగేసుకోవడం వల్ల; సముద్ర జలాలలో కలిసే, మురుగునీరు, పరిశ్రమల నుంచి వెలువడే రసాయినిక ద్రవ్యాలు, చమురు కాలుష్యాల కారణంగా రోజురోజుకూ ఇవి దెబ్బ తింటున్నాయి. "మన దీవులు ఉండాలంటే అవి ఉండి తీరాలి. సముద్రం తాకిడి నుంచి అవే మన దీవులను కాపాడుతున్నాయి," అని హెచ్చరించాడు ఆరోజు వచ్చిన సంస్థ సభ్యుడు ఒకరు.

ఇవన్నీ ఆలోచిస్తూ అలీ సముద్రతీరంలో పాఠశాల కేసి నడుస్తున్నాడు. దూరంలో ఒక తెల్లటి కారు కనిపించింది. ఆ దీవిలో పెద్దగా వాహనాలు లేవు. అలాంటి కారును అతడు అంతకు ముందెన్నడూ చూడలేదు. అలీ మరి కొంత ముందుకు వెళితే, ముగ్గురు వ్యక్తులు కారులోకి ఏదో వేగవేగంగా ఎక్కిస్తూండడం కంటబడింది. మరింత దగ్గరికి వెళ్ళాడు అలీ. వాళ్ళు కారులోకి పెడుతున్నది రకరకాల పగడా



లని గ్రహించి, "ఎవరు మీరు? ఏమిటి మీరు చేస్తున్నది?" అని అడిగాడు ఆతృతగా. ఆ ముగ్గురిలో ఒకడు వెనుదిరిగి, పిడికిలి బిగించి, అలీని డొక్కలో గుద్ది కింద పడదోసి, "ఏమైతే నీకేం? నీ పని నువ్వు చూడు," అంటూ కార్లోకి ఎక్కి మరిద్దరితో కలిసి వేగంగా వెళ్ళిపోయాడు.

అలీ లేచి నిలబడి ఒళ్ళు దులుపుకున్నాడు. వెళుతూన్న కారును మరొకసారి పరిశీలనగా చూశాడు. తననింత వరకు ఎవరూ ఇలా కింద పడగొట్టింది లేదు. ఆ అవమానంకన్నా ఎవరో పగడాలను దొంగిలించుకు పోవడం అతడికి మరింత బాధ కలిగించింది. "వాళ్ళను పట్టు కోవాలి. వాళ్ళను గురించి ఫిర్యాదు చేయాలి. ఫిర్యాదు చేయాలి!" అనుకుంటూ వెనుదిరిగి తన గ్రామం కేసి శరవేగంతో పరిగెత్తసాగాడు.

ఒక దుకాణం దగ్గరికి వెళ్ళి, "అయ్యా,

సైకిలు కొంచెం ఇస్తారా. ఇప్పుడే వస్తాను,'' అని అడిగి దుకాణందారు సరేనని తలూపగానే, సైకిలు మీద ఎక్కి వేగంగా పక్క గ్రామం కేసి తన శక్తికొద్దీ వేగంగా సైకిలు తొక్కసాగాడు. ''మన దీవులు ఉండాలంటే పగడాలు ఉండి తీరాలి!'' అన్న మాటలు అతడి మనసులో మాటి మాటికీ ప్రతిధ్వనించసాగాయి. అవి కొన్ని రోజుల క్రితం పర్యావరణ సంరక్షణా సంస్థ సభ్యుడు చెప్పిన మాటలు. అలా నాలుగు కి.మీ. దూరం వెళ్ళి పక్క గ్రామం చేరుకుని అక్కడున్న టెలిఫోన్ బూత్‌కు వెళ్ళాడు. ఫోన్ ద్వారా పర్యావరణ సంరక్షణా సంస్థ సభ్యుడికి తను చూసిన పగడాల దొంగతనం గురించీ, కారు ఆనవాళ్ళ గురించీ చెప్పాడు. (అదృష్ట వశాత్తు వాళ్ళ ఫోన్ నంబరు అతడి స్కూల్ బ్యాగ్‌లో కనిపించింది.) తను చేయగలిగింది చేసి, గ్రామానికి తిరిగి వచ్చి, దుకాణందారుకు సైకిలును అప్పగించాడు. ఆ తరవాత యథా ప్రకారం పాఠశాలకు వెళ్ళిపోయాడు.

మరునాడు పాఠశాల జరుగుతూండగా, అలీ తరగతికి ఒకరొకరుగా పలువురు ప్రము ఖులు రాసాగారు. పాఠశాల ప్రధానోపాధ్యా యుడు కొందరు పర్యావరణ పరిరక్షణ సంస్థ సభ్యులతోపాటు స్థానిక ప్రభుత్వాధికారినీ, ఇద్దరు పత్రికా విలేకరులనూ వెంటబెట్టుకుని వచ్చాడు. అలీ టెలిఫోన్ కాల్‌ను అందుకున్న సభ్యుడు-అంతకు ముందు రోజు జరిగిన విషయాలన్నిటినీ తరగతిలోని విద్యార్థులకు పూసగుచ్చినట్టు వివరించి, ''మన అలీ ఇచ్చిన ఫిర్యాదు, తెలియజేసిన కారు ఆనవాళ్ళను బట్టి, నిముషాల్లో అన్ని చెక్‌పోస్టులకూ హెచ్చరి కలు పంపాము. కారుతో సహా ఆ పగడాల దొంగలు ముగ్గురూ పట్టుబడ్డారు. వాళ్ళు ఆ పగడాలను కొల్‌కతాకు పంపి మంచి ధరకు అమ్ముకోవడానికి తీసుకువెళుతున్నారు. మన అలీ కారణంగా ఆ దొంగతనం అరికట్టబడింది. ఎంతో సమయస్ఫూర్తితో, ధైర్యంగా వ్యవహ రించిన అలీని అభినందిస్తున్నాను,'' అన్నాడు.



పిల్లల కరతాళ ధ్వనులతో, తర గతి మారుమోగింది. పత్రికా విలేకరులు వచ్చి తమ సహాధ్యా యిని ఇంటర్వ్యూ చేసి, ఫోటోలు తీస్తుంటే, పిల్లలు మరెంతగానో ఆనందించి మరొకసారి చప్పట్లు కొట్టారు. ''ఇది నాకు చాలా సంతోషకర మైన రోజు. అయితే పగడా లకు మరింత గొప్ప రోజు,'' అనుకున్నాడు అలీ.

-సుజాతా పద్మనాభన్
(యదార్థసంఘటన ఆధారంగా)

ఎం.ఎస్. ధోనీ





యువరాజ్ సింగ్



# మన ప్రపంచ ఛాంపియన్లు

సెప్టెంబర్ 24వ తేదీ దక్షిణాఫ్రికా జొహాన్స్‌బర్గ్‌లో జరిగిన ట్వంటీ20 వరల్డ్‌కప్ ఫైనల్‌లో భారతదేశం ప్రపంచ క్రికెట్ ఛాంపియన్ అయింది. మనదేశం ఐదు పరుగుల తేడాతో పాకిస్తాన్‌ను ఓడించింది.

ట్వంటీ20 క్రికెట్‌కు ఒక చరిత్ర ఉన్నది. ఇంగ్లాండుకు చెందిన నిక్ బోర్సిచ్ అనే ఒక అభిమాని ఒక్కొక్క పక్షాన 20 ఓవర్లు ఆడే 'ఇన్‌స్టంట్ క్రికెట్'ను సూచించాడు. 1953లో ఇంగ్లాండు, వేల్స్ దేశాల మధ్య ట్వంటీ20 పోటీలు మొట్టమొదటిసారి జరిగాయి. అవి ఘనవిజయం సాధించాయి.

త్వరలో దానిపట్ల ఇతరదేశాలకు కూడా ఆసక్తి కలగసాగింది. న్యూజీలాండ్, ఇండియా, మధ్య జరిగిన ఎగ్జిబిషన్ మ్యాచ్‌లో సచిన్ టెండూల్కర్ 'మేన్ ఆఫ్ ది మ్యాచ్'గా ప్రకటించబడ్డాడు.

దక్షిణాఫ్రికా తొలి ట్వంటీ20 వరల్డ్ కప్‌కు ఆతిథ్యమివ్వడానికి సంసిద్ధమయింది. అందులో పాల్గొనడానికి మహేంద్ర సింగ్ ధోనీ కెప్టన్‌గా మన దేశం యువక్రీడాకారులను పంపింది.

ఇండియాతో పాటు ఆస్ట్రేలియా, బంగ్లాదేశ్, ఇంగ్లాండ్, కీన్యా, న్యూజీల్యాండ్, పాకిస్థాన్, స్కాంట్‌ల్యాండ్, శ్రీలంక, వెస్ట్ ఇండీస్, జింబాబ్వే ఆటగాళ్ళు ఈ పోటీల్లో పాల్గొన్నారు.

జొహాన్స్‌బర్గ్‌లో సెప్టెంబర్ 11వ తేదీ జరిగిన ఓపెనింగ్ మ్యాచ్‌లో ఆఫ్రికా, వెస్ట్‌ఇండీస్‌తో ఆడింది. పదమూడు రోజుల తరవాత, ఇండియా పాకిస్తాన్‌తో పోటీ పడింది. టాస్ గెలిగిచిన ఇండియా మొదట బ్యాట్ చేయడానికి ప్రారంభించి 5కు 157 పరుగులు చేసింది. ఓపెనర్ గౌతమ్ గంభీర్ 75 పరుగులు చేశాడు.

గెలవడానికి 158 పరుగుల లక్ష్యంతో పాకిస్తాన్ చక్కగానే ఆడడం మొదలు పెట్టింది. ఓపెనర్ ఇమ్రాన్ నజీర్ 14 బంతులకు 33 పరుగులు చేశాడు. ఇర్ఫాన్ పఠాన్ షోయిబ్ (8) వికెట్లనూ, అఫ్రీడీ (0) వికెట్లనూ పడగొట్టారు. మిస్బా-ఉల్-హక్ ఒక సిక్సర్ తరవాత మరొకటి కొడుతూంటే పాకిస్తాన్‌కు విజయం ఖాయం అన్న పరిస్థితి ఏర్పడింది. లాస్ట్ ఓవర్ మూడవ బంతితో మరో సిక్సర్ కొట్టి 5 పరుగుల అవరోధాన్ని అధిగమించగలడని అనుకుంటూన్న తరుణంలో బంతి శ్రీశాంత్ చేతిలో పడింది. మ్యాచ్ ఇండియాకు అనుకూలంగా ముగిసింది.

సెప్టెంబర్ 19వ తేదీ, యువరాజ్ సింగ్ సూపర్-8 మ్యాచ్‌లో ఇంగ్లాండుకు వ్యతిరేకంగా ఆడుతూ, ఒక్క ఓవర్‌లో 6 సిక్సర్స్ సాధించి ప్రపంచ క్రికెట్ 'ఫాస్టెస్ట్ హాఫ్ సెంచురీ' రికార్డు సృష్టించాడు.

## సంథాలీ జానపద కథ

# యువరాజుకు నచ్చిన వధువు

ఒక రాజుకు చాలా కాలం సంతానం కలగలేదు. రాణి రాజును మరో వివాహం చేసుకోమని అర్థించింది. రెండో భార్యకూ సంతానం కలగలేదు. రాజు మూడో పెళ్ళి, నాలుగో పెళ్ళి కూడా చేసుకున్నాడు. కానీ సంతాన భాగ్యం మాత్రం కలగలేదు. మంత్రుల సలహా ప్రకారం, పెద్దల సూచనల మేరకు భార్యల సమేతంగా ఎన్నెన్నో మంచిపనులు చేశాడు. కానీ నలుగురు భార్యలలో ఒక్కరికీ పిల్లలు కలగలేదు.



తనకు ఈ జన్మకు సంతానభాగ్యం లేదేమోననుకుని అంతా విధిప్రకారం జరుగుతుందని నిస్పృహతో ఊరుకున్నాడు. క్రమక్రమంగా ఆయనకు రాజ్యపాలనా వ్యవహారాల పట్లకూడా ఆసక్తి సన్నగిల్లసాగింది.

రాజ్యంలోని ప్రజలు చింతాక్రాంతులయ్యారు. ఆ సమయంలో ఒకయోగి దేశాటన చేస్తూ ఆ రాజ్య రాజధానికి వచ్చాడు. ఆయన గురించి ప్రజలు ప్రధానమంత్రికి తెలియజేశారు. ప్రధానమంత్రి వెళ్ళి యోగిని దర్శించి, సంగతి చెప్పి రాజభవనానికి తీసుకువచ్చాడు. రాజు సకల మర్యాదలతో, భక్తిశ్రద్ధలతో యోగికి స్వాగతం పలికాడు. యోగి ఉచితాసనంలో కూర్చుని, "రాజా! నీకు ఇంతవరకు సంతానం కలుగలేదు కదా?" అని అడిగాడు.

"అవును, స్వామీ! అదొక్కటే తీరని కోరికగా ఉంది," అన్నాడు రాజు విచారంగా.

"నలుగురు భార్యలుండీ, ఒక్కరికీసంతానం కలగకపోవడం ఆశ్చర్యం!" అన్నాడు యోగి.

"ఎన్నో మంచి పనులు చేశాను. పెద్దలు, విజ్ఞులు చెప్పినవన్నీ చేశాను. కాని ప్రయోజనం కనిపించలేదు," అన్నాడు రాజు.

"అన్నీ చేశావుగాని, సర్వేశ్వరుడైన భగవంతుణ్ణి ఆశీర్వదించమని ప్రార్థించావా?" అని అడిగాడు యోగి.



''లేదు స్వామీ,'' అన్నాడు రాజు.

''అదీ అసలుకారణం! మంచి అవకాశాన్ని జారవిడుచుకున్నావు. ఇంకా నీకు సంతానం కావాలనే కోరుకుంటున్నావా?'' అని అడిగాడు యోగి.

''అవును స్వామీ,'' అన్నాడు రాజు.

''సర్వేశ్వరుడైన భగవంతుణ్ణి ప్రార్థించు. అదే సమయంలో నీకున్న సంపదలలో నాలుగోవంతు పేదలకు పంచు. దేవుడు సంతోషించి నీ కోరిక తప్పక నెరవేర్చగలడు,'' అని ఆశీర్వదించాడు యోగి.

రాజు యోగికి సాష్టాంగ నమస్కారం చేశాడు. యోగి రాజును మళ్ళీ ఒకసారి దీవించి అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ క్షణం నుంచే రాజు సంతానం ప్రసాదించమని దేవుణ్ణి ప్రార్థించసాగాడు. నిరంతరం దైవప్రార్థనలతో గడపసాగాడు. భూములు లేని వారికి భూములు పంచాడు. దానధర్మాలు చేశాడు.

కొన్నాళ్ళకు రాజుగారి చిన్నభార్య గర్భవతి అయి పండంటి మగబిడ్డను ప్రసవించింది. కొడుకు పుట్టగానే రాజు ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ప్రజలకు కానుకలు పంచాడు. రాజ్యమంతా వేడుకలు ఏర్పాటు చేశాడు. రాజుతోపాటు ప్రజలు కూడా ఎంతగానో సంతోషించారు.

బిడ్డను అల్లారుముద్దుగా పెంచసాగారు. యువరాజు యుక్తవయస్కుడయ్యేసరికి అద్భుతమైన చక్కని రూపంతో పాటు ధైర్య సాహసాలను సంతరించుకున్నాడు.

రాజు ఒకనాడు ఉద్యానవనంలో నలుగురు భార్యలతో విహరిస్తూ కొడుకు పెళ్ళిని గురించి



ప్రస్తావించి, "మన అబ్బాయికి అతడి అందానికి తగ్గ మంచి అందగత్తెను చూసి పెళ్ళి చేయాలి," అన్నాడు.

"మీరు ఎవరనుకుంటే, ఆ వధువుతో అబ్బాయికి పెళ్ళి జరపడంలో మాకెలాంటి అభ్యంతరమూ లేదు," అన్నారు రాణులు ముక్త కంఠంతో.

నలుగురు రాణులూ జ్యోతిష్కులను పిలిపించి యువరాజుకు తగిన వధువును చూడమన్నారు. ఆ సమయంలో అక్కడికివచ్చినరాజు, "వధువు ధనవంతుల బిడ్డయినా, పేదింటి పిల్లయినా ఫరవాలేదు. యువరాజు అద్భుత రూపానికి తగ్గట్టు అందచందాలతో ఉండడం చాలా అవసరం. భార్యాభర్తలు ఈడూ జోడూగా ఉండాలి," అన్నాడు.

"చిత్తం ప్రభూ, యువరాజుకు తగిన అందాలరాశి కనిపించగానే వచ్చి చెబుతాము," అంటూ జ్యోతిష్కులు వెళ్ళిపోయారు.

వాళ్ళు రాజ్యమంతా తిరిగి చూశారుగాని, యువరాజు రూపానికి సరితూగగల అందమైన యువతిని కనుగోనలేకపోయారు. కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి.

అదే సమయంలో తన కోసం పెద్దలు వధువును అన్వేషిస్తున్నారు అని తెలియగానే, యువరాజు తల్లి వద్దకు వెళ్ళి, "అమ్మా, అప్పుడే నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. పెళ్ళి చేసుకోవాలనుకున్నప్పుడు, నచ్చిన వధువును నేనే చూసుకుంటాను. మీకా విచారం వద్దు. ప్రస్తుతానికి వధువును వెతికే పని వద్దని నాన్నగారికి చెప్పు," అన్నాడు.

భార్య ద్వారా కొడుకు అభిప్రాయాన్ని తెలుసుకున్న రాజు బాధపడ్డాడు. కొడుకును పిలిచి, "మీ తల్లితో వధువును చూడవద్దని ఎందుకు చెప్పావు? అది నాకు అవమానం తెచ్చిపెడుతుంది కదా. ప్రజలు నన్ను పిసినారి అని నిందించరా? లేకలేక కలిగిన ఒక్కగానొక్క కొడుకు యుక్తవయస్కుడైనా పెళ్ళి చేయలేదేమని నన్ను గురించి హేళనగా మాట్లాడుకుంటారు కదా? అది నాకు కావాలా?" అని నిలదీశాడు.

యువరాజు బదులేదీ చెప్పకుండా మౌనం వహించాడు. అది రాజుకు మరింత ఆగ్రహాన్ని తెప్పించింది. "నా మాట విని

పెళ్ళి చేసుకోకపోతే, నువ్వు ఉండవలసింది రాజభవనంలో కాదు; చెరసాలలో. పెళ్ళి చేసుకోనన్నాడని కొడుకును చెరసాలలో పెట్టాడని ప్రజలు నిందించినా లెక్కచేయను,'' అన్నాడు ఆవేశంతో.

అప్పటికీ యువరాజు నోరువిప్పకపోవడంతో రాజు మంత్రిని పిలిపించి, ''అడ్డు ప్రశ్నలు వేయకుండా, యువరాజును తీసుకెళ్ళి చెరసాలలో బంధించు. అతడు పెళ్ళికి ఒప్పుకునేంత వరకు అక్కడే ఉంటాడు. ఇది నా ఆజ్ఞ,'' అన్నాడు ఆవేశంతో.

యువరాజు మంత్రివెంట నడిచాడు. చెరసాలలో బంధించాక, ''రాజుగారి ఆనతిని తమరు పాటిస్తే, మేము మిమ్మల్ని ఎంతగానో గౌరవించగలం,'' అని చెప్పి, బరువెక్కిన మనసుతో అక్కడి నుంచి వెనుదిరిగాడు మంత్రి.

కొంత సేపయ్యాక అక్కడికి వచ్చిన రాజు కాపలాభటులను, ''మా రాణులే వచ్చి అడిగినా వాణ్ణి విడిపించకండి. వాడి మీద ఎలాంటి సానుభూతీ, గౌరవ మర్యాదలూ చూపకండి. ఇతర ఖైదీలను చూసుకున్నట్టే చూసుకోండి. 'పెళ్ళికి సమ్మతమా?' అని రోజూ అడగండి వాడు 'సమ్మతం,' అని చెప్పినప్పుడు నా వద్దకు వచ్చి చెప్పండి. నేనే స్వయంగా వచ్చి వాణ్ణి విడిపిస్తాను,'' అని ఆజ్ఞాపించివెళ్ళాడు.

కాపలాభటులు రాజాజ్ఞను తు.చ. తప్పకుండా పాటించసాగారు. రోజూ యువరాజును, ''పెళ్ళికి సమ్మతమా?'' అని అడిగేవారు. యువరాజు ''కాదు,'' అనేవాడు. ఇలా కొన్నాళ్ళు గడిచాయి.

ఒకనాటి అర్ధరాత్రి సమయంలో కాపలాభటులకు ఎవరో మాట్లాడుకోవడం వినిపించింది. కాని రూపాలు కనిపించలేదు. ఆ సంభాషణలను బట్టి, అవి పవిత్ర వనాలను పాలించే దేవరాజు కుటుంబానివని తెలిసింది. యువరాజు చెరసాలలో ఉన్నాడని వారికి తెలియడంతో చూడడానికి వచ్చారు. కాపలాభటులు చెవులు రిక్కించి వినసాగారు:

''యువరాజుకు భార్య కాతగినవారు మానవులలో ఎవరూ లేరు. కాబట్టి ఆయన మన ఇద్దరు కుమార్తెలలో ఒకరిని భార్యగా స్వీకరించడానికి అంగీకరించవచ్చు,'' అన్నాడు దేవరాజు.



"అందుకు మన అమ్మాయిలు అంగీకరించాలి కదా?" అన్నది ఆయన భార్య.

ఆ మాట వినగానే, "మీకు సమ్మతమయితే నాకూ సమ్మతమే. ఈ రాత్రికి నన్ను ఇక్కడ ఉండడానికి అనుమతించినట్టయితే, యువరాజును వివాహానికి సమ్మతించేలా చేయగలను," అన్నది దేవరాజుగారి పెద్ద కుమార్తె.

తల్లిదండ్రులు అందుకు అంగీకరించి ఆమెను అక్కడే వదిలి వెళ్ళారు. ఆమె చెరసాలలోకి ఊచలగుండా ప్రవేశించింది. యువరాజు గాఢనిద్రలో ఉన్నాడు. ఆమె మంచం సమీపంలో కూర్చున్నది. కొంతసేపటికి ఎవరో తన గదిలో ఉన్నట్టు గ్రహించిన యువరాజు కళ్ళు తెరిచి చూశాడు.



ఎదురుగుండా కనులు చెదిరే అద్భుత సౌందర్యంతో ఒక యువతి కూర్చుని ఉండడం చూసి, మూసివున్న ఈ గది లోపలికి ఎలా రాగలిగిందా అని ఆశ్చర్యపోయాడు. ఆమె అందమైన చిరునవ్వుకు మంత్రముగ్ధుడై పోయినట్టు మైమరచి పోయాడు. కొంత సేపటికి, "నన్ను వివాహమాడగలవా?" అని అడిగాడు. "సంతోషంగా," అన్నది ఆ యువతి.

ఆ యువతి కేవలం సౌందర్యవతి మాత్రమే కాదనీ, కొన్ని అద్భుత శక్తులు కలదనీ యువరాజు గ్రహించాడు. తన వేలి ఉంగరం తీసి ఆమె వేలికి తొడిగాడు, ఆమె ఉంగరం కేసి ఆశగా చూశాడు. ఆమె ఉంగరం తీసి యువరాజు వేలికి వేసింది. పెళ్ళితంతు పూర్తయింది!

తెల్లవారుతూండగా గది కేసి వచ్చిన కాపలా భటులు యువరాజుతో పాటు ఒక అందాల యువతి ఉండడం చూసి అమితాశ్చర్యం చెందారు. ఒక భటుడు పరిగెత్తుకుంటూ వెళ్ళి రాజుకు ఆ వింత దృశ్యం గురించి చెప్పాడు. రాజూ, నలుగురు రాణులూ హుటాహుటిగా అక్కడికి వచ్చారు.

ఇన్నాళ్ళు తనకు నచ్చిన వధువు లభించక పోవడం వల్లే యువరాజు పెళ్ళి వద్దంటూ వచ్చాడనీ; ఇప్పుడు అపురూప సౌందర్యవతి లభించడంతో వెంటనే వివాహమాడాడనీ గ్రహించి వాళ్ళు ఆనందాశ్చర్యాలు చెందారు. కొడుకునూ, కోడలినీ మనసారా దీవించారు.

రాజ్యమంతటా ప్రజలు ఆనందోత్సాహాలతో వేడుకలు జరుపుకున్నారు!

# చందమామ కబుర్లు

## ఋగ్వేదానికి ఐక్యరాజ్య సమితి గౌరవం

ప్రపంచంలోనే అతి ప్రాచీనమైన సాహిత్యంగా 'ఋగ్వేదం' భావించ బడుతోంది. మరో 37 వారసత్వ అంశాలతోపాటు ఋగ్వేదాన్ని కూడా యునెస్కో 'మెమరీ ఆఫ్ ది వరల్డ్ రిజిష్టర్'లో నమోదుచేయాలని జూన్ 20వ తేదీ నిర్ణయించ బడింది. ప్రస్తుతం ఆ రిజిష్టర్‌లో మొత్తం 158 అంశాలు ఉన్నాయి. ఋగ్వేదం దాదాపు 5000 సంవత్సరాలకు పూర్వం నాటిదని విశ్వసించబడుతున్నది. వేదాలు అపౌరుషేయాలు. పరాశరముని కుమారుడైన కృష్ణద్వైపాయనుడు వేదమంత్రాలను ఋగ్, యజుర్, సామ, అథర్వణ వేదాలుగా విభజించి సంకలనం చేశాడనీ అందుకే ఆయనకు వేదవ్యాసుడనే పేరు వచ్చిందనీ చెబుతారు.

## ఇండియాకు వచ్చిన హ్యారీ పాటర్

హ్యారీ పాటర్ సీరీస్‌లో చివరిదీ ఏడవదీ అయిన, ''హ్యారీ పాటర్ అండ్ ది డెత్‌లీ హ్యాల్లోస్'' ప్రపంచ దేశాలలో విడుదలైన రోజునే జూలై 21వ తేదీ మనదేశంలోనూ విడుదలయింది. హ్యారీపాటర్ కథలాగే ఆ పుస్తకం విడుదల కావడం కూడా చాలా ఉత్కంఠభరితంగా సాగింది. 2,56,000 కాపీలను నిర్ణీత స్థలాలకు చేరవేసే బాధ్యత 'బ్లూమ్స్ సేఫ్ ఎక్స్‌ప్రెస్'కు చెందిన విజయ్ వాశిష్ట్ స్వీకరించారు. విడుదల తేదీకి ఇరవై రోజులు ముందుగానే కాపీలు స్టీమర్‌లో ముంబైకి చేరాయి. పెట్టెల మీద 'ది టైటిల్ చిల్డ్రన్స్!'' అనే లేబుల్ అతికించబడింది. 24 గంటలూ తుపాకులు పట్టిన 25 మంది కాపలా భటులు రక్షణగా నిలబడ్డారు. జూలై 14వ తేదీ 300 గమ్యాలకేసి 340 వాహనాలు బయలుదేరాయి. గ్లోబల్ పొజిషనింగ్ సిస్టమ్ మానిటర్ చేసిన వాహనాల కదలిక గురించి వాశిష్ట్‌కు, అతని ఇద్దరు అనుచరులకు మాత్రమే తెలుసు. బలమైన వర్షం కారణంగా గౌహతికి వెళ్ళే వాహనాన్ని ఢిల్లీకి మళ్ళించ వలసి వచ్చింది. అక్కడి నుంచి ప్రతులను విమానంలో పంపారు. ఇండియాకు చేరిన 2,56,000 ప్రతులలో దాదాపు 1,70,000 ప్రతులు మొదటి రోజునే అమ్ముడైపోయాయి!



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-2

# స్వాతంత్ర్యం కోసం వీరోచిత త్యాగం!

వింధ్య పర్వతాలకు ఆవల దక్కను పీఠభూమిలో బ్రహ్మాండమైన ప్రాకారాలతో ఎత్తయిన కుడ్యాలతో వందలాది కోటలు, రాతి నిర్మాణాలు-కడలి తరంగాలు, వర్షాల బీభత్సం, మండుటెండల తాకిడి మొదలైనవాటికి తట్టుకుని ఈనాటికీ మౌనంగా కాపలాభటుల్లా నిలబడి ఉన్నాయి. ఈ ప్రాంతం శత్రువులకు అభేద్యం. దురాక్రమణ దారులకు చొరరానిది. ఇక్కడి ప్రజలు అపూర్వ ధైర్య సాహసాలకు, మాతృభూమి పరిరక్షణకు పేరుగాంచినవారు.

అయినప్పటికీ 14వ శతాబ్ద ప్రాంతంలో కొందరు విదేశీయులు ఈ ప్రాంతంలో జొరబడ్డారు. మొగలులు ఈ ప్రాంతాన్ని ఆక్రమించి తమ అధీనంలోకి తెచ్చుకోవడంలో కృతకృత్యులయ్యారు.

ఇక్కడి జున్నార్ సమీపంలోని శివనేర్ కోటలో షాజీ భోన్స్లే, జిజాబాయి దంపతులకు 1627లో ఒక మగశిశువు జన్మించాడు. తమ ఇష్టదైవం 'శివభవాని' పేరు మీదుగా బిడ్డకు శివాజీ అని నామకరణం చేశారు. బిడ్డ పుట్టాక తండ్రి భోన్స్లే, బిజాపూర్ సుల్తాన్ వద్ద జాగీరుదారుగా చేరి అక్కడికి వెళ్ళాడు.

భక్తిసంపన్నురాలూ, వివేకవతీ అయిన తల్లి జిజాబాయి పెంపకంలో శివాజీ పెరగసాగాడు. ఆమె పురాణేతిహాసాలలోని వీరసాహస గాథలను బిడ్డకు చెబుతూ, లేతహృదయంలో ఉన్నత భావాలను పాదుకొల్పింది. దాదాజీ కొండదేవ్ అనే కుటుంబ మిత్రుడు శివాజీ విద్యాభ్యాసానికి ఎంతగానో సాయపడ్డాడు.

శివాజీ చిన్నప్పటి నుంచే సాహసకృత్యాలకు పేరొందిన స్థానికులైన మావళీలతో కలిసి మెలిసి మైత్రితో మసలసాగాడు. వారి నుంచి గుర్రపు స్వారీ, కత్తిసాము, మల్లయుద్ధం, మొదలైన



వాటిని నేర్చుకున్నాడు. క్రమంగా అద్భుతసాహసాలతో ఆ యువకులను ఆకట్టుకుని, వారిని తన అనుచరులుగా మలుచుకున్నాడు.

యువకుడైన శివాజీ హృదయంలో మెల్ల మెల్లగా స్వాతంత్ర్యకాంక్ష మొగ్గ తొడగసాగింది. దేశానికి పరాయి పాలననుంచి విముక్తి కలిగించి సొంత రాజ్యం స్థాపించాలని సంకల్పించాడు. ఒకనాడు తన ముఖ్య అనుచరులతో కలిసి శివాజీ రాయ్‌రేశ్వర్ సమీపంలోని ఒక గుహలో వున్న శివాలయానికి వెళ్ళాడు. తమ బొటన వేలును కోసుకుని, శివలింగం మీద రక్తాన్ని బొట్టులు బొట్టులుగా అర్పిస్తూ-మాతృభూమికి మొగలుల దుష్టపాలన నుంచి విముక్తి కలిగించగలమని ఆ యువకులు ప్రతిన బూనారు!

స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించడానికి సిద్ధంగా వున్న మావళీ వీరులను శివాజీ కూడగట్టుకున్నాడు. 1646లో తోర్నా కోటను ముట్టడించి వశపరచుకున్నాడు. ఆ తరవాత పురందర్, రాజ్‌గఢ్, సింహగఢ్, రాయ్‌గఢ్ అంటూ ఒక్కొక్క కోటగా వశపరచుకుంటూ, అనువైన ప్రాంతాలలో సైనిక బలాలను సమీకరించుకుంటూ విస్తరించసాగాడు. శివాజీ ప్రతాప్ ఘడ్‌లో చిన్న మందిరం నిర్మించి 'భవానీదేవి' విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు.

అంతవరకు నిశ్చింతగా విలాసాలలో మునిగి తేలుతూన్న మొగలు పాలకులు దక్కను పరిస్థితులకు ఉలిక్కిపడి ప్రమాదాన్ని గుర్తించారు. శివాజీని ఎలాగైనా నియంత్రించాలని ఆలోచించారు. ఆయన తండ్రి షాజీని ఖైదీగా పట్టుకుని, కొడుకు దురాగతాలను కట్టడి చేయమని ఆదేశించారు. అయితే శివాజీ ఎంతో చాకచక్యంతో, ఢిల్లీ నుంచి షాజహాన్ జోక్యం చేసుకునేలా చేసి, తండ్రిని విడిపించుకున్నాడు. తండ్రి ప్రమాదం నుంచి బయట పడ్డాక, శివాజీ మళ్ళీ దాడులను ప్రారంభించాడు. రాజా జావళీ పాలిస్తూన్న ప్రాంతాన్ని వ్యూహాత్మకంగా వశపరచుకున్నాడు. ఆ తరవాత అహ్మదాబాదును వశపరచుకుని, బిజాపూర్ సరిహద్దులకు సైన్యాన్ని పంపాడు.

యువకుడైన శివాజీ పుణే పరిసర ప్రాంతాలకు ఎదురులేని నాయకుడయ్యాడు. ఆయన అపూర్వ ధైర్యానికీ, సాహస కృత్యాలకూ దేశం అబ్బుర పడింది. అదే సమయంలో శత్రువులైన మొగలు పాలకులు ఆయన్ను తుదముట్టించడానికి సరైన సమయం కోసం ఎదురుచూడసాగారు.

సహ్యాద్రి కొండ మీది ప్రతాప్‌ఘడ్ కోట మీదికి ఒకనాడు కింది నుంచి పన్నెండు వేల మంది సైనికులు-తుపాకులు, ఫిరంగులతో రావడం కనిపించింది. దక్కను ప్రాంతాన్ని బాగా ఎరిగిన అఫ్‌జల్‌ఖాన్ శివాజీని పట్టుకోవాలన్న పట్టుదలతో సేనలకు నాయకత్వం వహించి వస్తున్నాడు.

మైదానంలో కన్నా కొండపైనుంచి శత్రుసేన





లను ఎదుర్కోవడం సులభమే అయినప్పటికీ, ఆ దృశ్యం శివాజీ అనుచరులకు ఓ క్షణం దిగ్భ్రాంతి కలిగించింది. ఆ తరవాత తేరుకుని శత్రువులను ఎదుర్కోవడానికి వ్యూహాలురచించ సాగారు. అయితే, అందరికీ ఆశ్చర్యం కలిగించే విధంగా-శివాజీని కలుసుకుని మంతనాలు జరపాలని సేనాధిపతి అఫ్జల్‌ఖాన్ దూత ద్వారా సందేశం పంపాడు!

ఇద్దరు అనుచరులతో మాత్రం వచ్చేలా అయితే కలుసుకోవడానికి అభ్యంతరం లేదని శివాజీ తెలియజేశాడు. సమావేశ స్థలమూ, సమయమూ నిర్ణయించబడింది. పల్లకీలో వచ్చిన అఫ్జల్‌ఖాన్ సమావేశం కోసం ఏర్పాటు చేసిన గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. కొంత సేపటికి శివాజీ అక్కడికి రాగానే ఆరడుగుల అఫ్జల్‌ఖాన్ లేచి నిలబడి నవ్వుతూ, ఐదడుగుల శివాజీని ఆప్యాయంగా చేతులు సాచి ఆహ్వానిస్తు న్నట్టు నటించి, దగ్గరికి రాగానే ఎడమ చేత్తో ఆయన గొంతు పట్టి నులుముతూ, కుడిచేత్తో తన మొలలోని బాకు తీసి ఆయన డొక్కలో పొడిచాడు. శివాజీ బాధను భరిస్తూ, ఎడమ చేత్తో అఫ్జల్‌ఖాన్ కడుపును చీల్చి పేగులు బయటికి వచ్చేలా కింద పడగొట్టాడు!

మంతనాలకు వస్తానన్న అఫ్జల్‌ఖాన్ కుట్రను ముందుగానే ఊహించి, శివాజీ తన శరీరానికి పలుచటి కవచమూ, ఎడమ చేతికి పదునైన ఇనుప పులిగోళ్ళూ ధరించి మరీ వెళ్ళాడు!

కుట్రతో హతమార్చాలని వెళ్ళిన సేనాధి పతి హతుడవడంతో మొగల్ సేనలు హడలి పోయాయి. శివాజీ సైనికులు వారిని చీల్చి చెండాడి తరుమగొట్టారు.

ఆ తరవాత శివాజీ కొల్హాపూర్ ప్రాంతంలోని పన్హాలా కోటను పట్టుకున్నాడు. ఆ ప్రాంతం లోని చిన్న చిన్న కోటలను వశపరచుకుంటూ, మొగలుల బలమైన స్థావరమైన బిజాపూర్‌ను ముట్టడించాడు. అయితే, సిద్దిజాహర్ నాయకత్వం లోని మొగలు సేనలు తమసేనలకన్నా ఎన్నో రెట్లు అధికంగా ఉండడంతో, అక్కడి నుంచి తిరుగుముఖం పట్టవలసివచ్చింది.

సిద్దిజాహర్ అమితోత్సాహంతో యాభైవేల సైన్యంతో పన్హాలా కోటను ముట్టడించాడు. అక్కడి నుంచి తప్పించుకోవాలి; లేకుంటే ఓటమి తప్పదు అన్న స్థితి ఎదురయింది. లొంగిపోవడా నికి సిద్ధంగా ఉన్నట్టూ, అంతకు ముందు సంధి చర్చలు జరపడానికి తనను కొండ కిందికి రావడా నికి అనుమతించాలనీ శివాజీ కోరాడు. సిద్ది జాహర్ అందుకు సంతోషంగా సమ్మతించాడు.

1660లో అది చీకటి కమ్ముకున్న ఒక తుపాను రాత్రి. భయంకరమైన ఉరుములు, మెరుపుల మధ్య రెండు పల్లకీలు పన్హాలా కోట

నుంచి వెలుపలికి వచ్చాయి. వాటి వెంట ఐదు వందల మంది సైనికులు నడిచారు. శివాజీకి అత్యంత విశ్వాస పాత్రుడూ, అసమాన వీరుడూ అయిన బాజీప్రభుదేశ్‌పాండే సేనలకు నాయకత్వం వహించాడు. పల్లకీలు సమతల ప్రదేశాన్ని సమీపిస్తూండగా మొగలు సేనలకు అనుమానం కలిగి వాటిని అడ్డుకోబోయారు. ఒకపల్లకీ ప్రధానమార్గం గుండా నడుస్తూండగా, రెండవ పల్లకీ విశాల్‌గఢ్ కేసి పక్క దారిలో కదల సాగింది. ప్రధాన మార్గంలో వస్తూన్న పల్లకిని ఆపి, అందులో శివాజీ ఉండడం చూసి పట్టరాని ఆనందంతో ఆయన్ను తమ సేనాధిపతి వద్దకు తీసుకువెళ్ళారు.

ఆయన్ను చూడగానే, "ఆహా! ఇంతకాలానికి మంతనాలకు వచ్చావన్న మాట!" అంటూ హేళనగా నవ్వాడు సేనాధిపతి. అయితే, వాళ్ళు పట్టుకున్నది అసలు శివాజీ కాదనీ, ఆయన పోలికలతో, అదే వేషధారణలో వున్న శివకాశిద్ అనే మరాఠీ వీరుడనీ గ్రహించి పట్టరాని ఆవేశానికి లోనయ్యాడు. తప్పించుకు పోతున్న అసలు శివాజీని పట్టుకోవడానికి మొగలు సేనలు గుర్రాలపై బయలుదేరాయి. ముందు వెళుతూన్న శివాజీని పట్టుకోవాలంటే మొగలు సేనలు ఒక ఇరుకైన కొండ కనుమ గుండా వెళ్ళాలి. వారిని అటు వెళ్ళకుండా అడ్డుకోవడానికి బాజీ ప్రభుదేశ్‌పాండే, కొందరు వీరులతో కలిసి కనుమ మార్గానికి అడ్డుగా నిలబడ్డాడు.

శత్రుసేనలు హాహాకారాలు చేస్తూ వచ్చాయి. మరాఠీ వీరులు కత్తులు దూసి వారిని ముందుకు వెళ్ళనీయకుండా, తమ శక్తికి మించి పోరాడారు. చూస్తూండగానే ఆ ప్రాంతం మొగలు సేనల శవాలతో నిండిపోయింది. అంతలో మొగలు సేనల వద్ద మందుగుండు సామాను అయిపోవడంతో, వాళ్ళూ కత్తులతోనే పోరాడవలసి వచ్చింది.

ఆ సమయానికి తమవైపున పదిహేను మంది సైనికులు మాత్రం మిగిలి ఉన్నట్టు బాజీప్రభు గమనించాడు. శత్రుసేనలు వారిని చుట్టుముట్టాయి. ఆ స్థితిలోనూ బాజీప్రభు అసమాన ధైర్యంతో పోరాడాడు. ఆఖరికి ఆయన కూడా తీవ్రంగా గాయపడి నెత్తురోడుతూన్న శరీరంతో పోరాడసాగాడు. పన్నెండు గంటలు గడిచిపోయాయి!

నిర్మలమైన ఆకాశంలో మూడుసార్లు ఫిరంగులు పేల్చిన శబ్దం ప్రతిధ్వనించింది. శివాజీ సురక్షితమైన విశాల్‌గఢ్ కోటకు చేరుకున్నాడనడానికి అది సంకేతం. ఆ క్షణం కోసమే ప్రాణాలు నిలుపుకుంటున్న బాజీప్రభు ఆనందంతో నేలకు ఒరిగాడు.

తమ రాజు కోసం, స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించిన ఆ వీరుల జ్ఞాపకార్థం ఆ కనుమకు 'పావన్ ఖిండ్' (పవిత్ర కనుమ) అని పేరు పెట్టారు!

-(ఎ.కె.డి)



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (23)

# తత్వవేత్త చివరి సూచన

క్రీ.పూ. 4వ, 3వ శతాబ్దాలలో భవననిర్మాణం, శిల్పకళ, నాటకం, నగరపాలన మొదలైన విషయాలలో పాశ్చాత్యదేశాలలో పురోగతి సాధించిన నగరంగా ఏథెన్స్ ప్రసిద్ధిగాంచింది. పేరుకు నగరమైనా నిజానికి అదొక నగర రాజ్యం.

ఆ కాలఘట్టంలోనే సుప్రసిద్ధ తత్వవేత్తా, ఆలోచనాపరుడూ, గురువూ అయిన సోక్రటీసు (క్రీ.పూ 470 – 399) ఏథెన్స్‌లో జీవించాడు. ఆయన నగరంలోని యువకులకు ఎలాంటి పక్షపాతవైఖరీ చూపకుండా, విశాల హృదయంతో వివిధ సమస్యలను విభిన్న కోణాల నుంచి పరిశీలించి పరిష్కారాలు కనుగొనాలనీ, అందుకు హేతుబద్ధమైన ఆలోచన చాలా అవసరమనీ బోధించేవాడు. బుద్ధిపరమైన సోమరితనం యువకులకు పెద్ద శాపంలాంటిదని ఆయన భావించాడు. ఆయన ఒక అకాడెమీని నెలకొల్పి అక్కడ రాజ్యపాలనా వ్యవహారాలతో సహా జీవితానికి సంబంధించిన సకలవిధ సమస్యలనూ చర్చించడానికి యువకులను ఆహ్వానించాడు. నగరంలోని యువకులందరూ సోక్రటీసును తమ మిత్రుడిగా, గురువుగా, మార్గదర్శకుడుగా గౌరవించసాగారు.

అయితే, అది అధికారంలో ఉన్నవారికి కంటగింపుగా తయారయింది. మేధావంతులూ, నిజాయితీ పరులూ అయిన యువకులు తమను తప్పుపడితే, తమ పదవులకు ముప్పు వాటిల్ల గలదని భయపడ్డారు. దీనికంతటికీ మూలకారణం సోక్రటీసు అనీ, ఆయన యువతను తప్పుదారి పట్టిస్తూ, చెడగొడుతున్నాడనీ ఆయన మీద నిందారోపణ చేశారు. ఐదు వందల ఒక్క న్యాయమూర్తులుగల సభలో హాజరై సంజాయిషీ ఇచ్చుకోమని సోక్రటీసును ఆజ్ఞాపించారు. తాను ఎలాంటి అపరాధమూ చేయలేదనీ, యువతకు ఆలోచించే విద్యను

## చందమామ ఇండియా క్విజ్-8 (సెప్టెంబర్ 2007) సమాధానాలు

1. బి. 18; 2. సి. శ్రీరంగం; 3. ఎ. టాగూరే చేశారు; 4. సి. జవహర్‌లాల్ నెహ్రూ; 5. ఎ. ఆర్.కె. నారాయణ్; 6. బి. సరోజినీ నాయుడు.

### విజేతలకు అభినందనలు:

1. సుమన విజయ, గోందాల – 533 450 (ఆం.ప్ర)
2. ఎం. వనజాక్షి, ఒంగోలు– 523 002, ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)
3. నేమాన సుభాష్, శ్రీకాకుళం – 532 001 (ఆం.ప్ర)
4. వి. వినీత్ రెడ్డి, హన్మకొండ – 506 001, వరంగల్లు (ఆం.ప్ర)
5. కె.వి.ఆర్, దీప్, ఒంగోలు – 523 001, ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)



బోధిస్తున్నాననీ, అందుకు తనను సత్కరించాలే తప్ప తనపై నిందారోపణ చేయడం తగదని సోక్రటీసు యుక్తియుక్తంగా వాదించాడు.

అయినా, న్యాయసభ ఆయనకు మరణ శిక్ష విధించింది! 'హెమ్లాక్' అనే విషాన్ని తాగాలని ఆదేశించింది. సోక్రటీసు ఏథెన్స్ నగరం నుంచి తప్పించుకుని వెళ్ళడానికి ఆయన మిత్రులు తగిన ఏర్పాట్లు చేశారు. అయితే, రాజ్యంలో ఒక చట్టం ఉన్నంతవరకు అది అవినీతికర మైనదైనా సరే దానిని గౌరవించడం ప్రతి పౌరుడి కర్తవ్యం అనీ; ఇటువంటి నీతి లేని చట్టాలు మునుముందు రద్దవుతాయనీ చెప్పి, పారిపోవ డానికి నిరాకరించాడు సోక్రటీసు.

చివరి రోజు రానే వచ్చింది. భార్యకూ, ఇద్దరు పిల్లలకూ వీడ్కోలు పలికాడు. ఆ తరవాత ప్లాటో, క్రిటోతో సహా ఆయన ప్రియతమ శిష్యులు ఆయన్ను విచారవదనాలతో చుట్టుముట్టారు. సోక్రటీసు వారిని మందహాసంతో చూస్తూ, ''మరణం అంత భయంకరమైనదని మీరెం దుకు భావిస్తున్నారు? ప్రశాంతంగా ఉండాలి,'' అంటూ పాత్రను అందుకుని విషం తాగాడు.

విషప్రభావంతో కాళ్ళుచేతులు చలనరహి తమై పోయాయి. మరికొంత సేపటికి మాట్లాడే శక్తిని పోగొట్టుకోగలనని గ్రహించిన సోక్రటీసు మెల్లగా పెదవి విప్పాడు. క్రిటో ఆయన దగ్గరికి వెళ్ళాడు. నగరంలోని ఒక కొట్టువాడి దగ్గర ఒక కోడి అప్పుగా పుచ్చుకుని ఇంకా చెల్లించలేక పోయానని చెప్పి, ''ఆయనకు చెల్లించ వలసిన బాకీని నువ్వు చెల్లిస్తావు కదూ,'' అని అడిగాడు. క్రిటో అలాగే చెల్లిస్తానని చెప్పడంతో, సోక్రటీసు తృప్తిగా చివరిశ్వాస విడిచాడు.

ఆయన చివరికోరిక తీర్చడానికి సంపన్ను లైన ఆయన శిష్యులలో ప్రతి ఒక్కరూ సిద్ధం గానే ఉన్నారు. అయితే, కొట్టువాడికి సంబం ధించినంతవరకు ఆ కోడిధర వసూలు చేసు కోవడం చాలా ముఖ్యంగా కనిపించింది. ఋణగ్రస్తుడిగా మరణించడం సోక్రటీసుకు ఇష్టం లేదు. -(ఎం.డి)





ఇంగ్లీష్-ఒరియా భాషలలో రచనలు చేస్తున్న ప్రొఫెసర్ మనోజ్ దాస్ ఈనాటి ప్రముఖ కథారచయితలలో ఒకరు. పిల్లలకు కథలు చెప్పడంలో ఆయన అందెవేసిన చేయి. చందమామ సంపాదక సలహాదారుగా ఉంటూ చందమామ పాఠకులకోసం ఆయన అసంఖ్యాకమైన రచనలు చేశారు. పద్మశ్రీ వంటి జాతీయ పురస్కారంతో పాటు సాహిత్య అకాడెమీ అవార్డు, మనదేశంలో సృజనాత్మక రచనలకు అందించే అత్యున్నతపురస్కారమైనసరస్వతీ సమ్మాన్ వంటిఎన్నో సత్కారాలు, సన్మానాలు అందుకున్నారు.

# వెంటాడిన సంగీతం

మొన్న ఒక సుభాషితం చదివాను. దాన్ని చెప్పిన వారెవరో తెలియదు గాని, అందులోని భావం మాత్రం చాలా గొప్పది: ''దేవుడు పక్షులను ప్రేమించాడు; వాటి కోసం చెట్టును సృష్టిం చాడు. మనిషి పక్షులను ప్రేమించాడు; వాటి కోసం పంజరాన్ని తయారుచేశాడు!''

ఆ సుభాషితం చదవిన వెంటనే ఎప్పుడో విన్న చక్కని కథ ఒకటి నా మనసులో కదలాడింది. ఆ కథ విని చాలా సంవత్సరాలు గడిచిపోయాయి గనక, నా భావాలు, ఉద్వేగాలు కలగలిసిపోయి అసలు కథ కాస్త పలచబడిపోయి ఉండవచ్చు. అయినా స్థూలంగా కథ ఇలా సాగుతుంది:

ఒకానొకప్పుడు దూర ప్రాంతాల వ్యాపారానికి వెళ్ళిన ఒక వర్తకుడు బిడారుతో తిరిగి వస్తూ ఒక అడవిని దాటవలసి వచ్చింది. అందమైన లోయ మధ్య ఒక తటాకం సమీపంలో ఆ రాత్రికి ఆగి వెళ్ళవలసి వచ్చింది. అది వెన్నెల రాత్రి. గుడారంలో కూర్చున్న వర్తకుడు తటాకానికి అవల ఉన్న గంభీరమైన కొండలను చూసి, తటాకం చుట్టూవున్న పూలచెట్ల నుంచి వీచే సుగంధ పరిమళాలను ఆస్వాదించి, ఎంతగానో ఆనందించాడు. అయితే, అన్ని అందాలకూ మించి ఆ ప్రశాంత వాతావరణంలో అప్పుడప్పుడు వినిపించిన కొన్ని పక్షుల పాటలు అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. దాన్ని వింటూ అలాగే నిద్రపోయాడు. రాత్రంతా, ఎన్నడూ కనని అందమైన కలలు కన్నాడు. తెల్లవారకముందే నిద్రలేచి ఆ కలలకు కారణం పక్షుల పాటే కారణమని గ్రహించాడు.

అతడు ఆ వింత పక్షుల పాట వినిపించిన గుబురు చెట్ల కేసి వెళ్ళి చూశాడు. ఒకటి రెండు పక్షులు ఇంకా అప్పుడప్పుడు పాడుతున్నాయి. ఒక పక్షి అప్పుడే గూటి నుంచి వెలుపలికి తొంగి చూస్తున్నది. సూర్యోదయం కాగానే పక్షులన్నీ ఎగిరి వెళ్ళిపోయాయి.

వర్తకుడి వెంట పక్షులుపట్టే వేటగాడొకడు ఉన్నాడు. వర్తకుడి కోరిక ప్రకారం వాడు చెట్టెక్కి పక్షి గూట్లో జిగురు వుంచి కంటికి కనిపించ కుండా వలపన్ని వచ్చాడు. సూర్యాస్తమయం అవుతూండగా పక్షులన్నీ గూళ్ళకు తిరిగి వచ్చాయి. వేటగాడు వలపన్నిన గూటిలోకి కూడా, ఏమాత్రం అనుమానం లేకుండా పక్షి లోపలికి జొరబడింది. వేటగాడు చరచరా

చెట్టెక్కి వెళ్ళి పక్షిని పట్టి తెచ్చి యజమానికి అప్పగించాడు.

పక్షి రెక్కలు కొట్టుకుంటూ తన వ్యతిరేకతను తెలియజేసింది. అయితే, వర్తకుడు దాన్నేమీ పట్టించుకోకుండా ప్రేమగా ఇలా అన్నాడు: ''నువ్వేమీ భయపడకు. నిన్నేమీ చేయను. నీకు నవరత్నాలు పొదిగిన బంగారు పంజరం చేయిస్తాను. ఏ పక్షులకూ అందుబాటులో లేని సుమధుర ఫలాలను నీకు ఆహారంగా పెడతాను. నా సేవకులు రాత్రింబవళ్ళు నిన్ను కంటికి రెప్పలా చూసుకుంటారు. నువ్వు చేయవలసిందల్లా ప్రముఖులు ఎవరైనా మా ఇంటికి వచ్చినప్పుడు, రోజుకు ఒకటి రెండు సార్లు పాడడం మాత్రమే. దాని ద్వారా నీకు పేరు ప్రఖ్యాతులు కూడా వస్తాయి.''



''అయితే, బందీగా ఉన్నప్పుడు నేను పాడలేనుకదా! నన్ను స్వేచ్ఛగా వదిలిపెట్టు. మీ వెంట ఎగురుతూ వచ్చి మీ ఇంటిని చూసుకుంటాను. అప్పుడప్పుడూ వచ్చి నీకోసం తప్పక పాడుతాను. నా మాట నమ్ము'' అన్నది పక్షి.

పక్షి రంగురంగులతో చాలా అందంగా కనిపించింది. వర్తకుడు పక్షి విన్నపాన్ని పెడచెవిని పెట్టి ఏ కొరతా లేకుండా జాగ్రత్తగా చూసుకుంటానని మళ్ళీ మళ్ళీ చెప్పసాగాడు.

పక్షి మరేమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయింది. లోయను వదిలి వర్తకుడి వాహనాలు అతడి ఇంటి కేసి బయలుదేరాయి.

ఇల్లు చేరాక పక్షి వర్తకుడి కోసం అప్పుడప్పుడు పాడుతున్నప్పటికీ మొదట వున్న శ్రావ్యత లోపించింది. మధురంగా ఉన్నప్పటికీ అంతర్లీనంగా తీరని ఆవేదన ధ్వనించసాగింది.

వ్యాపారి వద్ద ఉన్న పాటలు పాడే పక్షి గురించి ఊరంతా తెలిసిపోయింది. ఎందరెందరో ప్రముఖులువచ్చి దానిని చూడసాగారు. దానిని పట్టుకువచ్చిన వ్యాపారి అదృష్టాన్ని కొనియాడారు. పక్షికోసం రకరకాల కానుకలూ, చిన్న చిన్న ఆభరణాలూ ఇచ్చేవారు. అయినా స్వేచ్ఛకోల్పోయిన పక్షి ఎలాంటి కానుకలకైనా ఎలా ఆనందించగలదు? వారికేసి నిర్లిప్తంగా చూస్తూ ఊరుకునేది.

ఇలా రెండేళ్ళు గడిచిపోయాయి. వర్తకుడు మళ్ళీ వ్యాపారం కోసం బయలుదేరుతూ, పంజరం దగ్గరికి వెళ్ళి, ''నేను వ్యాపారానికి దూర ప్రాంతానికి వెళుతున్నాను. నేను ఇంటి వద్ద లేనప్పుడు నీకు ఎలాంటి కొరతా రాకుండా చూసుకోమని, ఇంట్లోనివారికీ పనిమనుషులకూ చెప్పాను. నీకు ఏ లోటూ రాదు. ఇంకో విషయం. నేను తిరిగి వచ్చేప్పుడు నీ స్వస్థలమైన లోయ గుండా రావలసి ఉంటుంది. నీ బంధుమిత్రు

లయిన తటాకం దగ్గరి పక్షులకేమైనా చెప్ప మంటావా?'' అన్నాడు పక్షితో.

''చాలా కృతజ్ఞతలు. నన్ను ఇక్కడ చక్కగా చూసుకుంటున్నారనీ, నిజానికి చాలా పేరు ప్రఖ్యాతులు పొందాననీ, అయితే, స్వేచ్ఛ మాత్రం లేదనీ, ఏం చేయడానికీ తోచడం లేదనీ చెప్పు,'' అన్నది పక్షి.

''తప్పకుండా చెబుతాను,'' అని చెప్పి వర్త కుడు అక్కడి నుంచి బయలుదేరాడు.

మూడు నెలల తరవాత వర్తకుడు తిరిగి వచ్చాడు. ఆయన వచ్చీ రాగానే, ''నేను చెప్పిన సంగతి నా మిత్రులకు చెప్పావా? అందుకు వాళ్ళు ఏమి సమాధానం పంపారు,'' అని పక్షి వర్తకుణ్ణి ఆతృతగా అడిగింది.

''నువ్వు చెప్పిన మాటలను పక్షులతో బిగ్గరగా చెప్పాను. ఒకసారి కాదు. రెండు సార్లు చెప్పాను. ఒక్కటీ బదులు పలకలేదు. నా మాటలు విన గానే కిలకిలమని శబ్దం చేయడం కూడా మానే శాయి. నిశ్శబ్దంగా ఉండిపోయాయి. ఆ నిశ్శ బ్దాన్ని చీల్చుకుంటూ ఒక పక్షి కొమ్మపై నుంచి కిందనున్న పొదలోకి దభీమని పడిపోయింది. బహుశా అది చచ్చిపోయిందనుకుంటాను,'' అన్నాడు వర్తకుడు ఎంతో విచారంగా.

పక్షి మౌనంగా ఊరుకున్నది. ఆ వార్త విన డంతో పక్షి దిగ్భ్రాంతి చెందివుంటుందని వర్త కుడు భావించాడు. పక్షికి ఓదార్పుగా నాలుగు మాటలు చెబుదామని అనుకుంటూండగా, పంజరంలోని అడ్డు ఊచ మీద కూర్చున్న పక్షి హఠాత్తుగా కింద పడిపోయింది.

''అయ్యో దేవుడా! ఆ లోయలోని పక్షి చని పోయిన సంగతి చెప్పకుండా ఉంటే బావుం డేది. పాపం ఆ వార్త విని తట్టుకోలేక ఇదీ చచ్చి పోయినట్టున్నది!'' అంటూ వర్తకుడు భోరున విలపించసాగాడు. పంజరం తలుపు తీసి పక్షిని వెలుపలికి తీశాడు. మౌనంగా ఇంటి పెరట్లో ఉన్న తోటకేసి నడిచాడు. తక్కినవారూ అతణ్ణి అనుసరించివెళ్ళారు.

పక్షిని ఎక్కడ పాతి పెట్టాలన్న విషయం చర్చించి ఒక నిర్ణయానికి వచ్చారు. అయితే, పక్షిని వర్తకుడు పచ్చ గడ్డి మీద ఉంచగానే, అది రివ్వునలేచి క్షణంలో దాపులనున్న చెట్టు కొమ్మ మీదికి ఎగిరి వెళ్ళి కూర్చుని, ''నా మిత్రుల సందేశం వినిపించినందుకు చాలా కృతజ్ఞతలు!'' అన్నది.

''ఆ పక్షులు ఎలాంటి సందేశమూ పంపలేదే!'' అన్నాడు వర్తకుడు విస్మయంతో ఒక్కటీ అంతుబట్టక.

''అవి నిజంగానే సందేశం పంపాయి. నేను చెప్పి పంపిన మాటలు నీ నోటి గుండా విన గానే ఒక పక్షి చచ్చిపోయి నట్టు కింద పడిపోయిందని చెప్పావు కదా. స్వేచ్ఛ సాధిం



## మన దేశం క్విజ్

### మనదేశంలో పుట్టి రెండు మతాలకు సంబంధించినది ఈ నెల క్విజ్

1. 24 మంది తీర్థంకరులలో మొట్టమొదటి వారెవరు?

2. గౌతమబుద్ధుడు ఏ భాషలో ఉపన్యాసాలిచ్చాడు?



3. బుద్ధుణ్ణి శాక్యముని అని ఎందుకు అంటారు?

4. మహావీరజైనుడి అనుచరులను ఏమని పిలుస్తారు?

5. బౌద్ధమతం మూడు శాఖలుగా విడి పోయింది. అవి ఏవి?

(సమాధానాలు 74వ పేజీలో)

చాలంటే నన్నూ అదేవిధంగా చేయమన్న సందేశం అందులో ఇమిడి ఉంది. నాకు ఆ సలహా ఎంత గొప్పగా పనిచేసిందో నువ్వు ప్రత్యక్షంగా చూశావు కదా?'' అన్నది పక్షి.

వర్తకుడు ఆశ్చర్యంగా దానికేసి చూశాడు. పక్షి మళ్ళీ, ''నువ్వు నా కోరిక మన్నించి మొదటే గనక నన్ను వదిలిపెట్టి ఉన్నట్టయితే, అప్పుడప్పుడు వచ్చి, నువ్వూ, నీ బంధుమిత్రులూ సంతోషపడే విధంగా పాడి ఉండేదాన్ని-ఎందుకంటే, స్వేచ్ఛగా ఉన్నప్పుడు మాత్రమే పాడగల పాట అది! అయితే నన్ను వదిలిపెట్టకూడదన్న లోభం నీలో పెరిగిపోయింది. ఇప్పుడు నేను నీ కోసం తుదిసారిగా ఒక పాట పాడుతాను- అదే నీకు శిక్ష!'' అన్నది.

''చాలా సంతోషం! అయినా అది నాకు శిక్ష ఎలా అవుతుంది?'' అని అడిగాడు వర్తకుడు అయోమయంగా.

పక్షి సమాధానం చెప్పకుండా, పాడడం మొదలు పెట్టింది. అందరూ ఆ పాట విని తన్మయత్వం చెందారు. హఠాత్తుగా పాటను ఆపి పక్షి ఎటో వెళ్ళిపోయింది, సుదూర మేఘాలను దాటుకుంటూ.

కొన్ని రోజులు గడిచాయి. పక్షి పాడిన పాట వర్తకుడి మనసులో తరచూ వినిపించ సాగింది. అది మళ్ళీ మళ్ళీ అతడి మనసులో ప్రతిధ్వనించడం వల్ల దాదాపు అతనికి పిచ్చెక్కినట్టయింది. ఇక భరించ లేక ఒకనాడు తిన్నగా అడవికి వెళ్ళి లోయను చేరాడు. పక్షులన్నీ ఆగ్రహంతో గుంపుగూడి కీచుకీచుమంటూ అతడి తల మీద వృత్తాకారంలో ఎగరడంతో, అతడు వెంటనే వెనుదిరిగాడు. అయితే, మనసులో వెంటాడే సంగీతం మాత్రం జీవితంలో ఆఖరి క్షణం వరకు అతణ్ణి వేధించ సాగింది.

# ఉత్తమ ఆయుధం!

అక్బర్ చక్రవర్తి ఒకనాడు ముఖ్య ప్రముఖులతో కలిసి ఉద్యానవనంలో పచార్లు చేస్తూ గులాబీ తోట అందానికి ముగ్ధుడై, ''అహా! భూతలస్వర్గం అంటూ ఉంటే అది ఇదే కదా!'' అన్నాడు.

''అవును, ప్రభూ! మీరన్నది అక్షర సత్యం,'' అన్నారు వెనక నడుస్తూన్న ప్రముఖులు, ఒక్క బీర్బల్ తప్ప.

అక్బర్ బీర్బల్‌కేసి తిరిగి చూశాడు. అతడు దేన్నో అదేపనిగా వెతుకుతూ కనిపించాడు.

''బీర్బల్, భూతలస్వర్గం అంటూ ఉంటే అది ఇదేనని నేను అన్నాను. దాన్ని గురించి నీ అభిప్రాయం చెప్పనే లేదు మరి,'' అన్నాడు అక్బర్.

''ఉద్యానవనం చాలా అందంగా ఉన్నది. అందులో సందేహం లేదు. అయినా,'' అంటూ ఆగాడు బీర్బల్.

''అంటే నువ్వు నా అభిప్రాయంతో ఏకీభవించడం లేదన్న మాట! అయినా, ఏమిటి అయినా...'' అన్నాడు అక్బర్ తీవ్రస్వరంతో.

''అందం ఉన్న చోటే ప్రమాదం కూడా పొంచి ఉంటుందంటారు కదా,'' అన్నాడు బీర్బల్.

''ప్రమాదమా! గూలాబీ చెట్లకున్న ముళ్ళ గురించి చెబుతున్నావా?'' అని అడిగాడు అక్బర్.

''ముళ్ళు, గులాబీ పూలకు సహజ కవచాలు. నేను వాటిని గురించి చెప్పడం లేదు,'' అన్నాడు బీర్బల్.

''మరి గడ్డిలో దాగి వుండే పాముల గురించి చెబుతున్నావా?'' అని అడిగాడు అక్బర్.

''మనుషుల అడుగుల చప్పుడు వినగానే పాములు పారిపోతాయి. ప్రాణ రక్షణకు మాత్రమే కాటేస్తాయి,'' అన్నాడు బీర్బల్.

''మరి ప్రమాదం దేనివల్లో కాస్త స్పష్టంగా చెప్పు,'' అన్నాడు అక్బర్.

''శక్తివంతులైన ప్రభువులకు శత్రువులు కూడా లెక్కకు మిక్కిలిగానే ఉంటారు. సమయం చూసి దెబ్బతీయడానికి కాచుకుని ఉంటారు. ముఖ్యంగా ఇరుగు పొరుగు రాజులు భయం



కారణంగానో, అసూయ వల్లనో ఎలాగైనా పడ గొట్టాలని చూస్తూంటారు. అలాంటి వారి పట్ల ప్రభువులు నిరంతరం అప్రమత్తులై ఉండడం చాలా అవసరం,'' అన్నాడు బీర్బల్.

ఆ మాటతో అక్బర్ ఆలోచనలో పడ్డాడు. మౌనంగా వెనుదిరిగాడు.

మరునాడు నిండు సభలో అక్బర్, ''హఠాత్తుగా ఆపద ముంచుకు వచ్చినప్పుడు రక్షణకు ఉపయోగపడే ఉత్తమ ఆయుధం ఏది?'' అని సభాసదులనుద్దేశించి అడిగాడు.

''పదునైన ఖడ్గం,'' అన్నాడు ఒక సభికుడు.

''కత్తి పట్టిన వాడు ఖడ్గవీరుడైనప్పుడే అది ఉపయోగపడుతుంది,'' అన్నాడు బీర్బల్.

''దూరం నుంచే శత్రువు మీదికి ప్రయోగించవచ్చుగనక, ఈటె ఉత్తమమైన ఆయుధం,'' అన్నాడు ఇంకొక ముఖ్యుడు.

''ఈటె తన మీదికి రాకముందే శత్రువు దాన్ని మధ్యలోనే పడగొట్టవచ్చు కదా?'' అన్నాడు బీర్బల్.

''ఫిరంగి!'' అన్నాడు మరొక సభికుడు.

''దాడి హఠాత్తుగా జరిగినప్పుడు ఫిరంగిని వెతుక్కోవడం సులభం కాదు కదా?'' అన్నాడు బీర్బల్.

''ఖడ్గమూ కాదు. ఈటే కాదు. ఫిరంగీ కాదు. మరి నీ దృష్టిలో ఉత్తమ ఆయుధం ఏది బీర్బల్?'' అని అడిగాడు అక్బర్.

''పరిస్థితికి తగ్గట్టు ఉపయోగపడేదే ఉత్తమ ఆయుధం!'' అన్నాడు బీర్బల్.

''ఫలానా ఆయుధం అని చెప్పలేవు, అంతే కదా?'' అన్నాడు బీర్బల్ కాస్త కటువుగా.

''సమయస్ఫూర్తితో ఆలోచించగల వ్యక్తికి



ఎలాంటి విపత్కర పరిస్థితిలోనైనాసరే ఉత్తమ ఆయుధం అందుబాటులో ఉంటుంది, ప్రభూ,'' అన్నాడు బీర్బల్ నెమ్మదిగా.

''అసంబద్ధం!'' అన్నాడు అక్బర్ ఆగ్రహంతో.

సభికులు లోలోపల నవ్వుకున్నారు.

''సమయం వచ్చినప్పుడు నా మాటలోని నిజాన్ని తమరే గ్రహించగలరు ప్రభూ!'' అన్నాడు బీర్బల్ వినయంగా.

మరునాడు ఉదయం అక్బర్ చక్రవర్తి బీర్బల్‌తో సహా కొందరు ప్రముఖులతో కలిసి వాహ్యాళికి బయలుదేరాడు. వాళ్ళు నదీ తీరాన్ని సమీపిస్తూండగా హాహాకారాలు చేస్తూ, కొందరు అటుకేసి రావడం కనిపించింది. వాళ్ళు చక్రవర్తిని చూసినా ఆగకుండా ప్రాణభీతితో పరుగులు తీస్తున్నారు. ఆఖరికి ఒకణ్ణి ఆపి

కారణం అడిగితే, ''రాజభవనంలోని ఒక ఏనుగు మదమెక్కి గొలుసులు తెంపుకుని నానా బీభత్సం సృష్టిస్తున్నది. అది ఇటువైపే వస్తున్నది. పారిపొండి. పారిపొండి!'' అంటూ వాడు వెళ్ళిపోయాడు.

వాడు అటు వెళ్ళగానే ఏనుగు గంటల నాదం, ఘీంకారం వినిపించాయి. అక్బర్ చేయి, మొలలో వేలాడుతూన్న కత్తి పిడి మీదికి వెళ్ళింది. తక్కినవారు కూడా కత్తులు దూయడానికి ఆయత్తమయ్యారు. అయినా, మదపుటేనుగును కత్తితో ఎదుర్కోలేమని వారందరికీ తెలుసు. అక్కడి నుంచి పారిపోవడం ఒక్కటే తరుణోపాయం. అయినా చక్రవర్తిని వదిలి వెళ్ళడానికి ఎవరికీ ధైర్యం చాలలేదు. చక్రవర్తి అక్కడి నుంచి వెనుదిరిగేలా లేడు. అందరూ బిక్కమొహాలతో బీర్బల్ కేసి చూశారు.



అయితే, బీర్బల్ ఏనుగు వస్తూన్న దిక్కు కేసి కూడా చూడడం లేదు. అతడి చూపులు నీరెండలో గోడ మీద కళ్ళు మూసుకుని పడుకుని వున్న ఒక పిల్లి మీద పడ్డాయి. బీర్బల్ అడుగు మీద అడుగు వేసుకుంటూ వెళ్ళి పిల్లిని పట్టుకున్నాడు. పట్టు విడిపించుకోవడానికి పిల్లి ప్రయత్నించింది. అయినా, అంతలో ఏనుగు సమీపించడంతో, పిల్లిని ఏనుగు వీపుమీద పడేలా గురి చూసి విసిరాడు. పిల్లి తల్లకిందులుగా ఎగురుతూ వెళ్ళి ఏనుగు వీపుపై నాలుగు కాళ్ళ మీద దభీమని నిలబడింది. భయంతో ఏనుగు వీపును గోళ్ళతో గిచ్చసాగింది. ఏనుగు అక్కడే నిలబడి, కోపంతో పిల్లిని పట్టుకోవడానికి తొండం సాచింది. దానిని గమనించిన పిల్లి వెంటనే కిందికి దూకి పారిపోసాగింది. ఏనుగు దాని వెంట బడి తరుముకుంటూ పరిగెత్తింది. అయినా పిల్లి దానికి చిక్కకుండా, దాపులనున్న పొదలలోకి వెళ్ళిపోయింది.

గండం తప్పినందుకు అక్కడి వారందరూ ఊపిరి పీల్చుకున్నారు.

''బీర్బల్, నీ సమయస్ఫూర్తికి జోహార్లు! మదపుటేనుగును తరమడానికి ఒక పిల్లిని ఉపయోగించిన నీ తెలివి అమోఘం! ఉత్తమ ఆయుధం అన్నది పరిస్థితిని బట్టి ఉంటుందన్న నీ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను,'' అన్నాడు అక్బర్ చక్రవర్తి మందహాసంతో.

# చందమామ ఇండియా క్విజ్ - 10

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ సంవత్సరం నుంచి గాంధీజయంతిని (అక్టోబర్ 2) ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ అహింసా దినోత్సవంగా జరుపుకుంటున్నది. ఈ సందర్భంగా ఈ నెల క్విజ్ ద్వారా మన జాతిపితను ఒకసారి స్మరించుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 10 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జనవరి 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. గాంధీజీ ఎక్కడ జన్మించాడు?
   ఎ. సూరత్ బి. కచ్ సి. పోర్బందర్
2. గాంధీజీ తల్లి పేరేమిటి?
   ఎ. కస్తూరీబాయి బి. పుతలీబాయి సి. విద్యావతి
3. గాంధీజీని మొదటి తరగతి రైలుపెట్టె నుంచి గెంటేసిన సుప్రసిద్ధ సంఘటన దక్షిణాఫ్రికాలోని ఏ నగరంలో జరిగింది?
   ఎ. డర్బన్ బి. జోహాన్స్‌బర్గ్ సి. మారిట్జ్‌బర్గ్
4. గాంధీజీ అధ్యక్షత వహించిన కాంగ్రెస్ మహాసభ ఏది?
   ఎ. బెల్గాం బి. బెజవాడ (విజయవాడ) సి. కాశి
5. మనదేశంలో గాంధీజీ ఒక వార్తాపత్రికను ప్రారంభించాడు. దాని పేరేమిటి?
   ఎ. ది ఇండియన్ ఒపీనియన్ బి. యంగ్ ఇండియా సి. హరిజన్
6. గాంధీజీ తన మొట్టమొదటి ఆశ్రమాన్ని ఎక్కడ స్థాపించాడు?
   ఎ. వార్ధా బి. సబర్మతి సి. భావ్‌నగర్
7. గాంధీజీ మనదేశంలో మొట్టమొదట సత్యాగ్రహాన్ని ఎక్కడ చేపట్టాడు?
   ఎ. చంపారన్ బి. జలియన్ వాలాబాగ్ సి. నవకాళీ




# జ్ఞాపకశక్తి

ఒక అమావాస్యరోజు ఉదయం ఏదో పని మీద కామేశం ఇంటికి వచ్చాడు రామేశం. ఆ సమయంలో తీర్థయాత్రకు వెళుతూ ఒక సాధువు వచ్చి గుమ్మం ముందు నిలబడ్డాడు. రామేశం రెండు రాగి కాసులాయనకు ఇచ్చి, ''ఒకటి నాది. రెండవది మా కామేశంది,'' అన్నాడు.

సాధువు దీవించి, ''మీ స్నేహం ముచ్చటయినది. నువ్వు మిత్రుడి నుంచి రాగి కాసు వెనక్కు తీసుకోకు. ప్రతి అమావాస్యనాడూ నీ మిత్రుడికో రాగి కాసు ఇస్తూ ఉండు. అది ఆయనకెంతో లాభం కలిగిస్తుంది. అలాగే నీ మిత్రుడు ప్రతి పున్నమిరోజూ నీకొక రాగికాసునిస్తే, అది నీకు లాభం కలిగిస్తుంది. అయితే రాగి కాసు విషయం ఎవరికి వారు గుర్తుంచుకోవలసిందే తప్ప, ఒకరికొకరు గుర్తు చేసుకోకూడదు,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు ఊరికి పుల్లయ్య అనేవాడు వచ్చి, ఊళ్ళో పదేళ్ళ క్రితం చేసి వెళ్ళిన అప్పులన్నీ తీర్చాడు. వాడు కామేశం నూరు వరహాల బాకీని వడ్డీతో సహా తీర్చేసినట్టు తెలిసి సాధువు దీవెన ఫలించిందనుకున్నాడు రామేశం.

సాధువు చెప్పిన ప్రకారం పున్నమినాడు కామేశం రామేశానికి రాగికాసు ఇవ్వలేదు. కానీ మళ్ళీ అమావాస్య రాగానే రామేశం కామేశాన్ని కలుసుకుని ఒక రాగి కాసునిస్తే, ''అరే! నీకింకా ఆరోజు సాధువు చెప్పిన విషయం గుర్తుందా?'' అన్నాడాయన ఆశ్చర్యంగా.

''నీకు లాభం కూడా కలిగాక, ఆ విషయం నేనెలా మరిచిపోగలను,'' అన్నాడు రామేశం.

కామేశం నవ్వి, ''పుల్లయ్య ఇంకా చాలా మంది అప్పులు తీర్చాడు. వాళ్ళందరికీ నువ్వు రాగికాసు లివ్వలేదుకదా!'' అన్నాడు. ''పూజ చేసిన వాడి కోసం వానకురిస్తే, చెయ్యని వాడి

బాబి

చేనుతడవక పోతుందా? నీవల్లే వాళ్ళందరికీ లాభించిందేమో,'' అన్నాడు రామేశం.

కామేశం చిన్నబుచ్చుకుని, ''ఈ మాత్రం నాకూ తట్టిందనుకో. కానీ అదేమిటో పున్నమి వచ్చే సరికి నాకీ విషయమే గుర్తురావడం లేదు. నీ జ్ఞాపకశక్తి నాకూ ఉంటే ఎంత బావుణ్ణు,'' అని నిట్టూర్చాడు.

ఆరాత్రే కాపలాభటులకు చాలా కాలంగా తప్పించుకు తిరుగుతున్న ఒక దొంగ దొరి కాడు. దోచిన డబ్బు, నగలను చెట్టు తొర్రలో దాస్తున్నాడు. వాటిలో కామేశం పోగొట్టుకున్న నగ కూడా ఉన్నది!

తనతోపాటు ఊళ్ళో చాలామంది నగలు దొరికినా-దీనికి కారణం తనకు రామేశం ఇచ్చిన రాగికాసు కావచ్చునన్న అనుమానం కామేశానికి కలిగింది. అయినా, ఆ తరవాత వచ్చిన పున్నమికి కూడా ఆయన రామేశానికి రాగికాసునివ్వలేదు.

అయితే, ఆ తరవాత వచ్చిన అమావాస్యకు కూడా రామేశం రాగి కాసునిచ్చాడు. కామేశం తడబడి, ''నువ్విచ్చే రాగి కాసువల్ల నాకు లాభం కలుగుతోంది. గుర్తుంచుకుని నేను నీకు రాగికాసునివ్వకపోవడం వల్లనే నాకు కలిగిన లాభం నీకు కలగకుండా పోతున్నది. నీ జ్ఞాపకశక్తి నాకు లేకపోవడం చిన్నతనంగా అనిపిస్తున్నది,'' అన్నాడు రామేశంతో.

రామేశం నవ్వి, ''అప్పిచ్చి నష్టపోయావు. నగపోగొట్టుకున్నావు. నా కలాంటి నష్టాలేమీ లేకపోవడం అదృష్టమే కదా! నేనిచ్చిన రాగి కాసువల్ల నీకా నష్టాలు పూడుకున్నాయి.



నాకేమో నా అదృష్టం గురించి తెలిసింది. కాబట్టి అనవసరంగా చిన్నబుచ్చుకోకు,'' అని వెళ్ళిపోయాడు.

ఆ తరవాత కూడా రామేశం వరుసగా ప్రతి అమావాస్యకూ కామేశానికి రాగి కాసు ఇస్తూనే ఉన్నాడు. కామేశానికి లాభం కలుగుతూనే ఉన్నది. అయినా ఒక్క పున్నమికీ కామేశం రామేశానికి రాగి కాసునివ్వలేదు.

అలా ఆరు నెలలు గడిచాక రామేశం ఏదో పని మీద ఊరెళ్ళడం వల్ల కామేశానికి ఒక అమావాస్యకు రాగి కాసు ఇవ్వలేకపోయాడు. ఆ మర్నాడు కామేశం పెరట్లో గొయ్యి తవ్వి స్తూంటే ఒక చెక్కపెట్టె నిండా రాళ్ళూరప్పలూ బయటపడ్డాయి. రామేశం తనకు రాగి కాసు ఇచ్చివుంటే ఆరాళ్ళు వజ్రాలుగా మారివుండే వని అనిపించి, ఈసారి పున్నమికి రామేశానికి

రాగి కాసొకటి ఇవ్వాలనుకున్నాడు కామేశం. ఈలోగా రామేశం పెరట్లో నుయ్యి తవ్వించ డానికి పున్నమి నాడు ముహూర్తం పెట్టాడు. అది కామేశానికి తెలిసి, ఆరోజు తను గనక రాగి కాసు ఇస్తే, సాధువు వరం ఫలించి రామేశా నికి నిధి దొరికినాదొరకవచ్చునని అనుమా నించి కాసు ఇచ్చే ఆలోచనను పక్కనబెట్టాడు. అందుకని పున్నమి ఘడియలు వెళ్ళి, పాడ్యమి ఘడియలు వచ్చేదాక ఆగి అప్పుడు రామేశం ఇంటికి వెళ్ళాడు. రామేశం ఆయన్ను చూసి, ''రా, కామేశం! నువ్వే ఇంకా రాలేదే మని చూస్తున్నాను,'' అన్నాడు.

''నాకు జ్ఞాపకశక్తి తక్కువ కావడం వల్ల నేను సాధువు చెప్పిన నియమం పాటించలేక పోయాను. ఇప్పుడు నేను నీకు కాసునివ్వా లనే వచ్చాను,'' అన్నాడు కామేశం గొప్పగా.

''అందుకేనేమో పది అడుగుల్లోనే జల ఊరుతోంది కామేశం,'' అన్నాడు రామేశం.

వాళ్ళేమి మాట్లాడుతున్నదీ అర్థం గాక, అక్కడివారు ఒకరి ముఖాలొకరు చూసుకో సాగారు. అప్పుడు రామేశం సాధువు ఇచ్చిన వరం గురించీ, ఆ తరవాత జరిగిన విశేషాలూ వివరించి, ''పోయిన అమావాస్యకు ఊళ్ళో లేనుగనక ఇవ్వలేదు. అయితే, వచ్చే అమా వాస్యకే కాదు. ఇంకెప్పుడూ రాగి కాసివ్వ కూడదని నిర్ణయించుకున్నాను,'' అన్నాడు.

''మంచి వాడనీ, పరోపకారి అనీ ఈయ నకు పేరు. ఇప్పుడు చూశారు కదా అసలు రంగు,'' అన్నాడు కామేశం హేళనగా.

అప్పుడు రామేశం కూడా నవ్వుతూ, ''అలా అంటావేమిటి కామేశం? నేను రాగికాసులిచ్చి నంత కాలం మూలబడ్డ నీ జ్ఞాపకశక్తి, ఇవ్వడం మానగానే పని చేస్తోంది. మనిషికి అనుకోని లాభాలకంటే, జ్ఞాపకశక్తి ముఖ్యం కదా. అంటే, రాగికాసు ఇవ్వడంకంటే, ఇవ్వక పోవడం వల్లనే నీకు ఎక్కువ ప్రయోజనం. నీకు రాగికాసు ఇవ్వడం మానేసి నా పరోపకార బుద్ధిని మరోసారి రుజువు చేసుకున్నాను,'' అన్నాడు.

ఇది వింటూనే అక్కడ ఉన్న వారందరూ ఫక్కున నవ్వారు. కామేశం, రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.





# దానపాత్రుడు

ఒకప్పుడు బోధిసత్వుడు కాశీ రాజుగా జన్మించాడు. ఆయన పరిపాలించే కాలంలో సరిహద్దున కొందరు పితూరీ జరిపారు. పితూరీదార్లను అణచే నిమిత్తమై రాజు కొంత బలాన్ని వెంటబెట్టుకుని సరిహద్దు ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాజుకు గాయం తగిలింది. ఆయన ఎక్కి ఉన్న గుర్రం కాస్త బెదిరిపోయి, ఆయనతో పాటు యుద్ధరంగం నుంచి పారిపోయింది.

కొద్దిసేపట్లో రాజు గుర్రంతోసహా ఒక సరిహద్దు గ్రామంలోని రచ్చపట్టును చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడ గ్రామంలోని ముప్పై గడపలవారూ చేరి గ్రామవ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. కత్తీ, డాలూ, కవచమూ ధరించి, యోధుడి వేషంలో రాజు అక్కడ ప్రత్యక్షమయ్యేసరికి, రచ్చపట్టులో చేరినవారంతా భయపడి చెల్లాచెదురుగా పారిపోయారు. ఒక్క గ్రామస్థుడు మాత్రం అక్కడి నుంచి కదలలేదు. ఆ గ్రామస్థుడు రాజును సమీపించి, ''నువ్వు పితూరీదారువా? రాజు పక్షం వాడివా?'' అని అడిగాడు.

''అయ్యా, నేను రాజు పక్షమే!'' అని రాజు జవాబు చెప్పాడు.

ఈ మాట విని గ్రామస్థుడు, తృప్తిపడ్డట్టు కనబడి, ''అయితే, మా ఇంటికి పోదాం, రా!'' అని రాజును తన అతిథిగా తీసుకుపోయి, తన భార్యచేత ఆయన కాళ్ళు కడిగించి, భోజనం పెట్టించి, అతిథి మర్యాదలన్నీ చేయించాడు. తరవాత రాజు ఎక్కి వచ్చిన గుర్రానికి నీరు పెట్టి, దాణా వేశాడు.

రాజు ఆ గ్రామస్థుడి ఇంట నాలుగు రోజులు అతిథిగా ఉండి తన గాయాలను మాన్పుకున్నాడు. ఈ లోపలే ఆయన సైనికులు పితూరీని అణచి వేయడం జరిగింది.

జాతక కథ



రాజు తిరిగి వెళ్ళిపోతూ, గ్రామస్థుడికి కృతజ్ఞత తెలుపుకుని, ''అయ్యా, నేను కాశీనగరవాసిని, మా ఇల్లు కోట ఆవరణలోనే ఉన్నది. నాకొక భార్యా, ఇద్దరు కుమారులూ ఉన్నారు. మీరు కాశీ నగరానికి వచ్చి కుడిచేతి వైపున ఉండే ఉత్తర ద్వారం దగ్గిర కాపలావాణ్ణి, 'మహాశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే, వాడు మిమ్మల్ని మా ఇంటికి తెస్తాడు. మీరు మీ చిత్తం వచ్చినంతకాలం మా ఇంట అతిథిగా ఉండవచ్చు!'' అని చెప్పాడు.

తరవాత రాజు తన బలాలను చేరుకుని, కాశీ నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన ఉత్తర ద్వారపాలకుణ్ణి పిలిపించి, వాడితో రహస్యంగా, ''ఒరే, ఎవరన్నా నీ వద్దకు వచ్చి, 'మహాశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే ఆ మనిషిని సగౌరవంగా నా దగ్గిరికి తీసుకురా!'' అని చెప్పాడు.

ఆ గ్రామస్థుడు వస్తాడని రాజు ఎంతో కాలం ఎదురు చూశాడు. కాని అతను రానే లేదు. అతన్ని ఏవిధంగానైనా రప్పించాలనే ఉద్దేశంతో రాజు తన మంత్రులతో చెప్పి ఆ సరిహద్దు గ్రామం మీద కొత్తపన్నులు వేయించాడు.

అప్పటికీ గ్రామస్థుడు రాజు వద్దకు రాలేదు. మరి కొంతకాలం చూసి రాజు ఆ గ్రామం మీద మరొక కొత్తపన్ను వేయించాడు. ఈ విధంగా రెండు మూడు సార్లు జరిగాక, ఆ గ్రామంలో ఉండే మిగిలిన వాళ్ళు గ్రామస్థుడి దగ్గిరికి పోయి, ''ఈ పన్నులతో చచ్చిపోతున్నాం. కాశీనగరంలో ఎవరో నీ మిత్రుడున్నాడని చెప్పావు గదా. నువ్వు వెళ్ళి ఆయనను చూసి, పన్నులు ఇచ్చుకోలేక మనం అందరం నానా అగచాట్లూ పడిపోతున్నామని మొరపెట్టి, వీటిని తీసివేయించలేవా?'' అన్నారు.

''నా స్నేహితుణ్ణి చూడటం కష్టం కాదు. కాని ఆయన దగ్గిరికి వట్టి చేతులతో ఎలా వెళ్ళేది? ఆయనకొక భార్య ఉన్నదిట, ఇద్దరు కొడుకులున్నారుట. అందరికీ బట్టలు తీసుకుపోవద్దా? ఆయన భార్యకు కానుకగా నగానట్రా తీసుకుపోవద్దా? వాటన్నిటినీ త్వరలో సిద్ధం చెయ్యండి. అలాగే బయలుదేరి వెళతాను,'' అన్నాడు గ్రామస్థుడు.

మిగిలినవాళ్ళు బట్టలూ, నగలూ సమకూర్చారు. అవి గ్రామస్థులకు పనికివచ్చే ముతక వస్త్రాలూ, మోటు నగలూనూ. గ్రామస్థుడు తన భార్యచేత రొట్టెలూ, పిండివంటలూ తయారు చేయించాడు. తాను తీసుకుపోయే

వస్తువులన్నీ ఒక మూటకట్టి వెంటతీసుకుని బయలుదేరాడు.

కొంతకాలానికి అతను కాశీ నగరపు కోట చేరి, కుడివైపున ఉండే ఉత్తర ద్వారం సమీపించి, అక్కడి ద్వారపాలకుణ్ణి, "బాబూ, నేను మహాశ్వారోహుడింటికి వెళ్ళాలి. దారి ఎటు?" అని అడిగాడు.

తక్షణమే ద్వారపాలకుడు గ్రామస్థుణ్ణి తన వెంట పెట్టుకుని రాజుగారి అంతఃపురానికి తీసుకుపోయి రాజుగారి ఎదట పెట్టాడు.

అతణ్ణి చూసి రాజుకు పరమానందమయింది. గ్రామస్థుడు తనకోసం తెచ్చిన తినుబండారాలను ఆయన తన భార్య చేతా, కుమారులచేతా, తన మంత్రి సామంతుల చేతా తినిపించి, తాను కూడా తిన్నాడు. అతను తెచ్చిన ముతకబట్టలను తన భార్యాబిడ్డలచేత కట్టించి, తాను కూడా కట్టుకున్నాడు. తరవాత ఆయన తన అతిథికి మేలైన పట్టుబట్టలు కట్టబెట్టి, తన పాకశాలలో తయారైన భోజనమే అతనికి పెట్టించాడు. తన గ్రామం మీద వేసిన పన్నులు తీయించటానికి అతను వచ్చాడని తెలిసి, రాజుగారు ఆ పన్నులను రద్దు చెయ్యవలసిందిగా మంత్రులకు ఉత్తరువిచ్చాడు.

తరవాత రాజు సభ చేశాడు. ఆ సభలో మంత్రి సామంతులందరి సమక్షాన రాజు ఆ గ్రామస్థుణ్ణి తన అర్ధ రాజ్యానికి రాజుగా ప్రకటించాడు.

ఈ గ్రామస్థుడు వచ్చిన క్షణం నుంచి రాజుగారు అతనిపట్ల చూపుతూ వచ్చిన ఆదరం మంత్రులు మొదలైన వారికి కొంచెం కూడా నచ్చలేదు. అతడికి అర్ధ రాజ్యం పట్టం కట్టడం వారి దృష్టిలో చాలా అవివేకంగా కనిపించింది. కాని రాజుగారికి ఎదురు చెప్ప



టానికి వారికి సాహసం లేకపోయింది. అందు కని వారు రాజకుమారుణ్ణిచేరదీసి, "నాయనా, మహారాజుగారు నీకు చాలా అన్యాయం చేస్తున్నారు. నీకు చెందవలసిన రాజ్యంలో సగం భాగం నిష్కారణంగా ఈ అనాగరికుడికి కట్టబెడుతున్నారు. ఇందుకు గాను మహారాజు గారి దగ్గిర ఆక్షేపణ తెలుపుకోవలసినవాడవు నువ్వే!" అంటూ ఆ కుర్రవాడికి బాగా బోధించి పంపారు.

రాజకుమారుడు తండ్రి దగ్గిరికి వెళ్ళి, వాళ్ళు చెప్పినట్టే తన ఆక్షేపణ తెలిపాడు.

అంతా విని రాజు, "నాయనా, ఇది నీకు కలిగిన ఆలోచన కాదు. నన్నిప్పుడడిగిన ప్రశ్న సభలో అడుగు. అప్పుడు నీకు నేను తగు విధంగా సమాధానం చెబుతాను!" అన్నాడు.

రాజకుమారుడు ఆ ప్రకారమే నిండు సభలో తండ్రిని, "ఈ గ్రామస్థుడికి మీరు అర్ధరాజ్యం ఇవ్వటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

వెంటనే రాజు, "కుమారా, ఈ గ్రామస్థుడు ఒకప్పుడు నాకు ప్రాణదానం చేశాడు. ఆ సంగతి నీకు తెలియదు," అంటూ సరిహద్దున పితూరీ జరిగిన సమయంలో బాగా గాయపడిన తనను గ్రామస్థుడు కాపాడిన వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు. ఆ తరవాత ఆయన ఇంకా ఇలా అన్నాడు:

"అపాత్రుడికి దానం చెయ్యటం ఎంత తప్పో, పాత్రుడికి దానం చెయ్యకపోవటం కూడా అంత తప్పే. నేను రాజునని ఎరగకుండానే ఈ గ్రామస్థుడు నాపట్ల విశ్వాసం చూపాడు. సమయానికి సాయపడ్డాడు. నేను రమ్మని ఆహ్వానించినప్పటికీ, ప్రత్యుపకారం పొందే ఉద్దేశం లేని కారణంచేత, అతడు రానే లేదు. చివరకు గ్రామక్షేమం కోరి మాత్రమే బయలుదేరి వచ్చాడు. నా అర్ధ రాజ్యానికి ఇంతకంటె అర్హుడెవరు?"

ఈ మాటలు విని మంత్రి సామంతులందరూ సిగ్గుపడ్డారు. రాజకుమారుడు తను చేసిన పొరపాటు గ్రహించాడు. అతడికి తండ్రి మాటలు చాలా సంతోషం కలిగించాయి. ఆనాటినుంచి రాజు తన జీవితాంతం వరకూ ఆ గ్రామస్థుణ్ణి ఎంతో ఆదరంతో చూశాడు.





# రామాయణం

వసంతకాలం. పంపాసరస్సులోని జలం నిర్మలంగా ఉన్నది. అందులో కమలాలూ, నల్ల కలువలూ పూస్తున్నాయి. సరస్సు చుట్టూ ఉండే అరణ్యం అత్యంత మనోహరంగా ఉన్నది. గండుకోయిలలు కూస్తున్నాయి. నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి.

ఈ వసంత శోభను గమనించి రాముడు ఒక వంక ఆనందమూ, మరొక వంక సీతకై వేదనా పొంది తన స్థితికి ఎంతగానో విలపించాడు. ఎటు చూసినా, దేన్ని చూసినా అతనికి సీతే జ్ఞాపకం వచ్చింది. అతను లక్ష్మణుడితో నిరాశాపూరితంగా మాట్లాడాడు. ''లక్ష్మణా, ఈ మనోహరమైన ప్రాంతంలో నా వెంట సీతే ఉంటే జీవితంలో ఇంకేమీ కోరను. కానీ, సీత లేకుండా జీవించటం అసంభవంగా ఉన్నది. నేను ప్రాణాలు వదిలేస్తాను, నువ్వు భరతుడి వద్దకు వెళ్ళి పో,'' అని పెద్ద పెట్టున ఏడవ సాగాడు.

లక్ష్మణుడు రాముడికి హితం చెప్పాడు. సీతపై గల అమితమైన ప్రేమచేతనే దుఃఖం కలుగుతున్నదనీ; ఆ ప్రేమనూ, వేదననూ దూరంగా ఉంచమనీ, రావణుడి జాడ తెలుసుకుని సీతను తెచ్చుకోవలసి ఉన్నదనీ, రావణుడు మంచిగా సీత నివ్వకపోతే అతణ్ణి వధించవలసి ఉంటుందనీ, ఇందుకు ధైర్యం అవసరమనీ, దుఃఖం కార్యనాశకమనీ లక్ష్మణుడు రాముడికి చెప్పి ధైర్యం కలిగించాడు.

రామలక్ష్మణులు పంపాసరస్సు వద్దకు వచ్చిన క్షణం నుంచీ, ఋశ్యమూక పర్వతం మీద ఉంటున్న సుగ్రీవుడనే వానరరాజు

కిష్కింధా కాండ–1



వారిని చూస్తూనే ఉన్నాడు. ఏనుగు గున్నల్లా గున్న ఆ ఇద్దరూ ఆ ప్రాంతానే తచ్చాడుతూ ఉండటం చూసి సుగ్రీవుడికి దడ పుట్టు కొచ్చింది. తనకు కీడు చేసే ఉద్దేశంతో తన అన్న అయిన వాలి వారిని పంపి ఉంటాడను కుని సుగ్రీవుడు తన మంత్రులైన వానరులతో సహా మతంగాశ్రమంలోకి వెళ్ళి కూచున్నాడు. ఎందుకంటే అక్కడ వారికి వాలి భయం లేదు. వాలి తాలూకు మనుషులు కూడా అక్కడికి రాలేరు.

సుగ్రీవుడు తన మంత్రులతో, ''వీరెవరో నారబట్టలు కట్టి, మారు వేషాలు వేసుకుని, పని బెట్టుకుని ఈ అరణ్యంలోకి వచ్చారు. ఎందుకో తెలుసా? వాలే వీరిని పంపి ఉంటాడు,'' అన్నాడు. ఆ మాటలు విని అందరూ భయపడ్డారు.

అప్పుడు, సుగ్రీవుడు మంత్రులలో ఒక డైన హనుమంతుడు, ''మీరంతా ఎందుకిలా భయపడుతున్నారో తెలియకుండా ఉంది. ఈ ఋశ్యమూకం మీదికి వాలి రాడు. రాజైన వాడికి ఇలాటి చపలచిత్తం కూడదు,'' అని చెప్పాడు.

ఆ మాట విని సుగ్రీవుడు, ''వాలి ఇక్కడికి వచ్చాడని నేననలేదు. ఆ మనుషులను చూడు; పొడుగైన వాళ్ళ చేతులు చూడు, ఆ చేతుల్లో ఉండే కత్తులూ, వారి విల్లంబులూ చూడు! వారిని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది. వాలే వారిని తప్పక పంపి ఉంటాడని నా అనుమానం. వాలి రాజు గనక అతనికి ఎందరో సహాయకులుంటారు. మనం ఎంతో జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే మనని శత్రువులు మోసగించి నాశనం చేసేస్తారు. వాలి మహాదక్షుడు. అందుచేత నువ్వు మారు వేషంతో వెంటనే వారి వద్దకు వెళ్ళి, వారితో మాట్లాడి వారి రహస్యం ఏమిటో తెలుసుకు రావాలి,'' అన్నాడు.

తమ రాజైన సుగ్రీవుడి అభిప్రాయం తెలుసుకుని హనుమంతుడు వానర రూపం వదిలి బ్రహ్మచారి రూపం ధరించి రామలక్ష్మ ణుల వద్దకు వెళ్ళి, వినయంతో వారికి నమస్కారం చేసి, ''అయ్యలారా, మీరు వ్రతదీక్ష బూని తపస్సు చేసుకునే రాజర్షు ల్లాగా కనిపిస్తున్నారు; ఎక్కడో రాజ్యాలేల వలసిన మీరు ఈ పంపా సరోవర ప్రాంతాన, నారబట్టలు కట్టి ఎందుకు తిరుగుతున్నారు? మీరెవరు? మా రాజైన సుగ్రీవుడనే వానరుడు

అన్న చేత వెళ్ళగొట్టబడి, దీనుడై తిరుగుతున్నాడు. నే నాయన మంత్రిని. నా పేరు హనుమంతుడు. నా తండ్రి వాయుదేవుడు. సుగ్రీవుడి కోరికపై నేను ఈ బ్రహ్మచారి రూపు ధరించి ఋశ్యమూకపర్వతం నుంచి వచ్చాను. నాకు కామరూప, కామగమన శక్తులున్నాయి,'' అని చెప్పాడు.

హనుమంతుడి మాటలు వింటూంటే రాముడి ముఖాన ఆనంద రేఖలు గోచరించాయి. అతను లక్ష్మణుడితో, ''ఇతనికి నువ్వే సమాధానం చెప్పు. ఇతని మాటల తీరు చూడగా మంచి భాషా జ్ఞానమూ, పాండిత్యమూ కలవాడుగా కనిపిస్తున్నాడు. ఇలాటి దూతలు గల రాజేరాజు,'' అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు హనుమంతుడి కేసి తిరిగి, ''హనుమంతుడా, వానర రాజైన సుగ్రీవుణ్ణి గురించి మాకు బాగా తెలుసు. మేమాయనకోసమే వెతుకుతూ వస్తున్నాము. ఈయన మా అన్న రాముడు. ఇతనికి మీ సుగ్రీవుడి సహాయం కావలసి ఉన్నది. సుగ్రీవుడికి ఈయన తిరిగి రాజ్యం ఇప్పించగలడు,'' అంటూ తమ కథ యావత్తూ హనుమంతుడికి సవిస్తరంగా చెప్పేశాడు. చిట్టచివరకు, ''రాముడి భార్యను తీసుకుపోయిన రాక్షసుడి జాడ సుగ్రీవుడు చెప్పగలడని కబంధుడి ద్వారా మాకు తెలిసింది. సీతను వెదకటానికి సుగ్రీవుడు మాకు సహాయపడాలి. అడిగిన వారికి అంతులేని దానాలు చేసిన ఈ రాముడు ఈ సహాయం కోసం సుగ్రీవుణ్ణి అర్థిస్తున్నాడు,'' అని



లక్ష్మణుడు హనుమంతుడితో అన్నాడు. ఈ మాటలు నోటి వెంట అనటానికి లక్ష్మణుడికి ఎంతో దుఃఖం కలిగింది.

హనుమంతుడు లౌక్యంగా, ''మీరు మహానుభావులు. మిమ్మల్నే సుగ్రీవుడు వెతుక్కుంటూ రావలిసింది. ఆయన పుణ్యవశాన మీరే ఆయనను వెతుక్కుంటూ వచ్చారు. సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడు పూర్తిగా మీకు సహకరిస్తాడు. ఇంక మనం సుగ్రీవుడి వద్దకు పోదామా?'' అన్నాడు.

హనుమంతుడు నమ్మదగిన వాడేననీ, అతను నిజమే చెబుతున్నాడనీ తృప్తి కలిగి రామలక్ష్మణులు అతని వెంట వెళ్ళటానికి సిద్ధపడ్డారు. హనుమంతుడు బ్రహ్మచారి రూపు వదిలిపెట్టి వానర రూపం ధరించి, రామలక్ష్మణులను తన వీపు మీద ఎక్కించు



కుని ఋశ్యమూక పర్వతానికి వెళ్ళాడు. సుగ్రీవుడు ఋశ్యమూకం మీద లేడు, మలయపర్వతం మీద ఉన్నాడు; హనుమంతుడు అక్కడికి వెళ్ళి రామలక్ష్మణులు వచ్చి ఉన్నారనీ, సుగ్రీవుడు వచ్చి వారితో స్నేహం చేసుకోవటం లాభకరమనీ చెప్పాడు. రామలక్ష్మణులకు సుగ్రీవుడి వల్ల కావలిసిన సహాయం కూడా వివరించాడు.

హనుమంతుడి మాటలు విన్నాక సుగ్రీవుడి భయం తీరిపోయింది, అతను సంతోషించి, తన వానరరూపు విడిచి అందమైన మానవరూపు ధరించి రామలక్ష్మణులను చూడవచ్చాడు. అయన రాముడితో, "మిమ్మల్ని గురించి హనుమంతుడు అంతా చెప్పాడు. మహారాజువైన నువ్వు నా స్నేహం కోరి రావటం వానరుణ్ణయిన నాకు ఎంతో గౌరవం, ఎంతో లాభకరం," అంటూ స్నేహ చిహ్నంగా చెయ్యి చాచాడు. రాముడు సుగ్రీవుడి, చేతిని పట్టుకుని తన స్నేహభావాన్ని అతడికి స్పష్టం చేశాడు. తరవాత రాముడు సుగ్రీవుణ్ణి గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

హనుమంతుడు అరణులు మధించి అగ్ని చేసి, ముందుగా తానా అగ్నిని పూజించి తెచ్చి రామ సుగ్రీవుల మధ్య ఉంచాడు. వారిద్దరూ ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి అగ్ని సాక్షిగా మైత్రి చేసుకున్నారు. ఇకనుంచీ ఒకరి సుఖదుఃఖాలు మరొకరివని ప్రమాణం చేసుకున్నారు. సుగ్రీవుడొక మద్దికొమ్మ విరిచి తెచ్చాడు. రాముడూ అతనూ ఆ కొమ్మమీద కూచున్నారు. అలాగే హనుమంతుడొక చందనపు చెట్టుకొమ్మ విరిచి తెచ్చి లక్ష్మణుణ్ణి దానిపై కూచోబెట్టాడు. అప్పుడు సుగ్రీవుడు రాముడితో, "రామా, నా అన్న అయిన వాలి నాకు అన్యాయం చేశాడు, నా భార్యను అపహరించాడు. వాలి భయంతో ఇలా అడవులు పట్టి తిరుగుతున్న నాకు అభయం ఇవ్వాలి," అన్నాడు.

"సుగ్రీవా, నీ స్నేహానికి ప్రత్యుపకారంగా నేను నీ అన్న అయిన వాలిని చంపేస్తాను. అతని చావు నా బాణాలలోనే ఉన్నది," అని రాముడన్నాడు.

"నీ అనుగ్రహంతోనే నేను రాజ్యాన్నీ, నా భార్యనూ తిరిగి పొందవలసి ఉన్నది. మీరు ఏ పని మీద ఈ నిర్జన వనాల్లో తిరుగుతున్నారో అదంతా హనుమంతుడు చెప్పాడు. నువ్వూ, నీ తమ్ముడూ లేని సమయం చూసి ఒంటిగా

ఉన్న సీతాదేవిని బలాత్కారంగా రావణుడు ఎత్తుకుపోయాడు. తనకు అడ్డు తగిలిన జటాయువును కూడా అతను చంపేశాడు. నీకు త్వరలోనే భార్యావియోగం పోతుంది. సీతాదేవి మూడు లోకాలలో ఎక్కడ ఉన్నప్ప టికీ ఆమెను తెచ్చి నీకు అప్పగిస్తాను. ఇప్పుడు నాకు అర్థమయింది, నేనా నాడు చూసినది సీతాదేవినే, సందేహం లేదు. ఏడుస్తూ ఆకాశ మార్గాన పోతున్న సీతను నేను చూశాను. ఆవిడ కూడా నన్నూ, నా వెంట ఉన్న నలు గురు వానర వీరులనూ చూసింది; చూసి, తన ఆభరణాలను పైబట్టలో మూట గట్టి మా కేసి విసిరింది. ఆ ఆభరణాలను ఇంత కాలంగా భద్రంగా ఉంచాము. వాటిని చూసి నువ్వు గుర్తుపట్టవచ్చు,'' అన్నాడు.

రాముడీ మాట విని ఆ ఆభరణాలు చూడటానికి తహతహలాడాడు. సుగ్రీవుడు లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీత ఆభరణాల మూటతో తిరిగి వచ్చాడు. మూటను చూస్తూనే రాముడు సీత ధరించిన పైబట్టను గుర్తించి శోకావేశంతో కూలిపోయాడు. అతను కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, ''లక్ష్మణా, రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు సీత ఆకాశం నుంచి పడవేసిన ఈ పై బట్టా, నగలూ చూడు,'' అన్నాడు.

లక్ష్మణుడు సీత ఆభరణాలు చూసి, ''ఈ కేయూరాలూ, కుండలాలూ, హారాలూ నేను గుర్తించలేదు గాని, సీత కాళ్ళకు నమస్క రించేటప్పుడు కనిపించిన అందెలు మాత్రం ఇవే,'' అన్నాడు.



రాముడు సుగ్రీవుడి కేసి తిరిగి, "నువ్వు చూస్తూండగానే గదా ఆ రాక్షసుడు ప్రాణ సమానురాలయిన నా భార్యను ఎత్తుకు పోయాడు! వాడెక్కడికి వెళ్ళాడు? దయచేసి చెప్పు, వాడి ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

రావణుణ్ణి గురించి తనకు ఏమీ తెలియ దన్నాడు సుగ్రీవుడు; అయితే సీత దొరక గలందులకు తగిన ప్రయత్నాలన్నీ తాను చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. తరవాత అతను రాముడికి ధైర్యం చెబుతూ, "వానర మాత్రుణ్ణి అయి ఉండి కూడా నేను భార్య కోసం ఇలా దుఃఖంతో కుంగిపోలేదు. దుఃఖంవల్ల ప్రయో జనం లేదు, పౌరుషం అవలంబించాలి, ధైర్యంగా ఉండాలి," అని హితవు చెప్పాడు.

ఈ మాటలు విని రాముడు ధైర్యం తెచ్చు కుని, సుగ్రీవుడితో, "నువ్వు నిజమైన మిత్రుడ నదగిన మాట అన్నావు. కష్ట సమయంలో నీలాటి ఆప్తుడు దొరకటం కష్టం. నువ్వు మాత్రం సీతను వెతికే ప్రయత్నం తప్పక చేయాలి. ఇప్పుడు నేను నీకు చెయ్యవలసిన సహాయం గురించి చెప్పు. ఆ సహాయం నా వల్ల అవుతుందో కాదోనన్న సందేహమేమీ పెట్టుకోకు. వాలిని చంపుతానని మాట ఇచ్చానే. అందులో అబద్ధమేమీ లేదు. నేనెన్నడూ అబద్ధమాడినవాణ్ణి కాను," అన్నాడు.

రాముడి మాటలకు వానరులు పరమా నందం చెందారు. తరువాత రామ సుగ్రీవులు ఏకాంతంగా సంభాషించుకుని తమతమ కష్టాలు ఒకరికొకరు చెప్పుకున్నారు. సుగ్రీ వుడు రాముడితో, "నా అన్న వాలి బలశాలి. యువరాజుగా ఉన్న నన్ను తిట్టి, రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. ప్రాణాలకన్న ఎక్కువైన నా భార్యను హరించాడు. నా స్నేహితులను కారాగృహంలో పెట్టాడు. నన్ను చంపే ఉద్దే శంతో ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. అతను పంపిన వానరులను ఎంతమందినో నేను చంపాను. మా అన్న భయంతోనే నేను మిమ్మల్ని చూడగానే మీ ఎదటికి రాలేదు. నాకిప్పుడున్నదల్లా ఈ హనుమంతుడు మొద లైనవారే. వారి చలవవల్లనే నేనింకా బతికి ఉన్నాను. నాకు పరమ విరోధి అయిన ఆ వాలి చస్తే తప్ప నాకు జీవితం లేదు, సుఖం లేదు. ఇది నా విషాదగాథ. కష్టాలు మిత్రులకే చెప్పు కోవాలిగద," అన్నాడు.





# పాతాళరాక్షసుడు

మగధదేశపు రాజు శక్తిసేనుడి పరిపాలనలో కలతలు బయలుదేరి, వేరు వేరు తరగతుల మధ్య కలహాలుగా పరిణమించి, అరాజక పరిస్థితి ఏర్పడింది. అన్ని మతాల వారూ, వృత్తుల వారూ, కులాల వారూ, తమ తమ వృత్తులకూ, వ్యాపకాలకూ ఉద్వాసన చెప్పి యుద్ధానికి దిగినట్టుగా తయారయ్యారు.

ఈ పరిస్థితిని అదుపులో పెట్టటానికి శక్తి సేనుడు ఏవో శాసనాలు చేశాడు. కానీ ఆ శాసనాల ఆధారంతోనే ప్రజలు మరింతగా అంతఃకలహాలు కొనసాగించారు.

రాజు తన అసమర్థతను గ్రహించి మంత్రీ, పురోహితుడూ అయిన యజ్ఞశర్మను, ''ప్రజా జీవితం ఇలా కంటకప్రాయం అయిపోతు న్నదేం? ఈ పరిస్థితులలో సరి అయిన పరిపాలన జరగాలంటే ఏం చేయవలసి వుంటుంది?'' అని అడిగాడు.

దానికియజ్ఞశర్మ ''రాజా, నీ అనుమానాలు తీరగలందులకు ఒక చిన్న ఇతిహాసం చెబు తాను, శ్రద్ధగా విను!'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

పాతాళలోకంలో రాక్షసరాజ్యం సుభిక్షంగా ఉండే రోజుల్లో, అఘోరుడు అనే రాక్షసుడు అల్లరులు లేవనెత్తి, అలజడి కలిగించ సాగాడు. అది చూసి రాక్షసరాజు అఘోరుణ్ణి పాతాళం నుంచి బహిష్కరించాడు. ఆ విధంగా అఘోరుడు భూలోకానికి రావడం జరిగింది. వస్తూనే వాడు ఒక ఎడారి ప్రాంతంలో అడుగు పెట్టాడు. అక్కడ వాడికి ఏ విధమైన తిండీ దొరకక మనుషులుండే ప్రాంతాలకు వచ్చి, అందిన మనుషులను అందినట్టు విరుచుకు తినసాగాడు.

ఇందువల్ల భూలోకంలో పెద్ద సంచలనం కలిగింది. అఘోరుడు ఎప్పుడు ఏ ప్రాంతా

25-ఏళ్ళనాటి చందమామ కథ



మామూలు ఆయుధాలను లక్ష్యపెట్టేది కాదు. వాడు భూలోకంలో విచ్చలవిడిగా సంచరిస్తూ అలజడి కొనసాగిస్తూనే వచ్చాడు.

వ్యక్తుల శౌర్యపరాక్రమాలు రాక్షసుడి మీద పనిచెయ్యవనీ, ఈ రాక్షసుడి వల్ల అన్నిదేశాల ప్రజలకూ ప్రమాదమేననీ స్పష్టమయింది. అప్పుడు దేశదేశాల రాజులందరూ ఒకచోట సమావేశమై, కర్తవ్యం గురించి చర్చించారు. అందరిలోకీ అనుభవజ్ఞుడైన ఒక రాజు ఇలా అన్నాడు:

''లక్ష చీమలు కలిసి ఒక పామును చంపగలుగుతున్నాయి. గడ్డిపోచలను కలిపి వేసిన తాడు మదపుటేనుగును బంధించటానికి పనికి వస్తున్నది. ఐకమత్యాన్ని మించిన బలం లేదు. భూమి మీది మనుషులంతా ఒకటైతే ఆ రాక్షసుణ్ణి ఎదుర్కోవడం పెద్ద సమస్య కానేకాదు.''

ఇంతకంటే మంచి ఆలోచన లేదని అందరూ ఒప్పుకున్నారు.

అఘోరుణ్ణి ఎదుర్కోవడం కోసం మర్నాడే ప్రజలంతా ఒకచోట కూడసాగారు. వందలూ, వేలతో ఆరంభమై జనసమూహం లక్షలకూ, కోట్లకూ చేరుకున్నది. భాషలను గురించీ, సంస్కృతులను గురించీ మరచిపోయి, అందరూ ఒక్కటైపోయారు.

ఈ మహాసైన్యం రెండురోజుల్లో అఘోరుణ్ణి అందుకున్నది. వెంటనే రాక్షసుడికీ, జనసమూహానికీ యుద్ధం ఆరంభమయింది. వాణ్ణి చూసిగాని, వాడి పాదాల కింద నలిగి చస్తామని గాని ఎవ్వరూ భయపడలేదు.

నికి వస్తాడో తెలియదు. ఏ క్షణాన ఎవరికి చావుమూడుతుందో తెలియదు.

భూలోకంలో చాలా దేశాలున్నాయి. ఎవరి భాష వాళ్ళది. ఎవరికి వాళ్ళే అందరికన్నా గొప్పవాళ్ళు. ఏ రెండు దేశాలకూ పడదు. ప్రతి దేశమూ ఇతర దేశాలను జయించి, వాటిపై పెత్తనం చలాయించాలని చూస్తుంది. అందుచేత తరచుగా యుద్ధాలు జరుగుతుంటాయి. అందులో పైచెయ్యిగా ఉండటానికి కొత్తకొత్త మారణాయుధాలు కనిపెట్టబడుతూ ఉంటాయి.

అఘోరుడు భూలోకానికి వచ్చిన తొలి రోజుల్లో అనేక మంది వీరులు ముందుకు వచ్చి తమ తమ దేశాలను వాడి బారి నుంచి కాపాడటానికి ప్రయత్నించారు. కాని తాటి చెట్టు ప్రమాణంగల అఘోరుడి శరీరం

క్షణాలమీద పోయి అఘోరుణ్ణి ఆపాదమస్తకమూ మనుషులు కమ్మేశారు.

అంతటి రాక్షసుడూ తన జీవితంలో మొదటిసారిగా భయం అంటే ఏమిటో తెలుసుకున్నాడు. ఇంతమంది జనం ధాటికి తన వజ్రశరీరం కూడా తట్టుకోలేదని వాడికి తెలిసిపోయింది. అందుకని వాడు జనాన్ని ఎదుర్కొనే ఆలోచన కట్టిపెట్టి పరుగు లంకించుకున్నాడు. పరిగెడుతున్న వాడి కాళ్ళకింద ఎందరో నలిగి చచ్చారు. వాడి శరీరం మీదికి పాకిన మనుషులు కిందికి దూకి కాళ్ళూ, చేతులూ విరుచుకున్నారు. అయితేనేం? ప్రజలకు వాడి పీడ వదిలింది.

అటు తరవాత అఘోరుడు మనుషులను ఎదుర్కోవడానికి రెండు మూడు ప్రయత్నాలు చేసి ఘోరంగా దెబ్బతిని, చావు తప్పి కన్ను లొట్టపోయినట్టు అయ్యాడు. తరవాత వాడు అరణ్యాలను ఆశ్రయించి, తన జీవన విధానం మార్చుకుని, పొదుపుగా జంతువులను చంపి తిన సాగాడు. లేకపోతే వారం రోజుల్లో అడివంతా ఖాళీ అయి, తాను తిండికి మాడవలసి వస్తుంది.

అయితే వాడికి నరమాంసం మీద భ్రాంతి తగ్గలేదు. ఒకసారి అడవిలో వాడికి ఒక ఆడది కనిపించింది. ఆమెను తిందామనే ఉద్దేశంతో వాడు చెయ్యిచాచి, ఆమెను పట్టుకున్నాడు. అంతలోనే ఆ ఆడది రాక్షసిగా మారిపోయి వాడికి దిగ్భ్రమ కలిగించింది. ఆ రాక్షసిని వాడు పాతాళలోకంలో ఎరుగును. ఆమె పేరు అఘోరిక. ఆమె ఇలా అన్నది.



"నువ్వు వెళ్ళిపోయాక పాతాళలోకం చిన్నబోయిందనిపించింది. నిన్ను వెతుక్కుంటూ ఇలా వచ్చాను. ఎందుకైనా మంచిదని మనిషి రూపంలో వచ్చాను."

అఘోరుడు ఆమెకు తన భూలోకపు అనుభవాలు చెప్పాడు.

అఘోరిక నవ్వి, "వెర్రివాడా, మనుషులు బలంగల వాళ్ళు కాకపోయినా, తెలివిగల వాళ్ళు. వాళ్ళను బలంతో కన్న తెలివితో ఎదుర్కోవాలి! మనం వాళ్ళమధ్య వాళ్ళ రూపాలతోనే నివసిస్తూ, వాళ్ళను మోసం చెయ్యాలి. అప్పుడు జీవితం పాతాళలోకంలో కన్న బాగుంటుంది!" అన్నది.

రాక్షసులిద్దరూ మానవరూపాలు ధరించి, మానవుల మధ్య జీవించసాగారు. మనుషులకు తెలివి తేటలుంటే ఉన్నాయేమో గాని,

వాళ్ళు వట్టి స్వార్థపరులని త్వరలోనే వాళ్ళకు తెలిసిపోయింది. వాళ్ళు మనుషుల స్వార్థాన్ని అవకాశంగా తీసుకుని మనుషులను ఒకరి మీద ఒకరిని రెచ్చగొట్టసాగారు. ప్రజలలో మళ్ళీ అన్ని రకాల భేదాలూ వచ్చేశాయి- భాషాభేదాలూ, జాతిభేదాలూ, కులభేదాలూ, మతభేదాలూ! మనుషుల మధ్య కొట్లాటలు ఎక్కువఅయ్యాయి. అఘోరుడూ, అఘోరికా ఈ గందరగోళంలో మనుషులను అపహరించి తింటూ రాసాగారు. మనుషులు ఒకరినొకరు అనుమానించుకుంటూ, తమ మధ్యనే వున్న రాక్షసులను అనుమానించలేకపోయారు!

రాక్షసులకు ఈ జీవితం చాలా బాగున్నది. వాళ్ళు భూలోకంలో శాశ్వతంగా ఉండిపోదలచుకున్నారు. వారి సంతతి క్రమంగా ప్రపంచం అన్ని మూలలకూ విస్తరించింది. వాళ్ళు తమ సంతతికి ఇలా హితబోధ చేశారు:

''మీరు రాక్షసులని తెలిస్తే మనుషులంతా ఒక్కటై పోతారు. మనిషిరూపంలోని రాక్షసుణ్ణి [illegible] ఎంతో ఆదరిస్తారు. అదే మనకు క్షేమం.''

అఘోరుడి సంతతి వాళ్ళు ఇప్పుడు అన్ని కులాలలోనూ, మతాలలోనూ, భాషలలోనూ, దేశాలలోనూ ఉండి, మనుషులంతా ఏకం కాకుండా చెయ్యగలుగుతున్నారు. వారి నిజ స్వరూపం బయటపెట్టి, మనుషుల మధ్య నుంచి వారిని తరిమివేయ గలిగే వరకూ భూమిమీద శాశ్వతమైన శాంతి నెలకొనదు!

యజ్ఞశర్మ కథ ముగించి, ''రాజా, ప్రజలు ఎప్పుడూ శాంతిజీవనాన్నే కోరుకుంటారు. వారు పోరాటానికి దిగారంటే, వారిని అలా పురికొల్పిన శక్తులు వారి మధ్యనే ఉంటాయి. అరాజక పరిస్థితి వల్ల లాభం పొందేవారెవరో తెలుసుకొని, వారు ఎంత సన్నిహితులైనా, పలుకుబడి గలవారైనా సంకోచించకుండా పురుగేరిన పక్షంలో దేశం అతి త్వరలోనే సుభిక్షమై, సుస్థిరమైన శాంతి నెలకొంటుంది,'' అన్నాడు.

శక్తిసేనుడు తన మంత్రి ఆంతర్యం గ్రహించి, తన రాజ్యంలో ఉండే ప్రచ్ఛన్న రాక్షసుల నందరినీ తొలగించి, మగధరాజ్యపు ప్రతిష్ఠను తిరిగి నెలకొల్పాడు.





చిత్రాలు: గాంధి అయ్య

22

# అజేయుడు గరుడుడు!

సూర్యపురి సైనికులు ఆలయాన్ని చుట్టుముట్టారు. కాని అందరూ సుడిగాలిలో చిక్కుకున్న ఎండుటాకుల్లా సుడులు తిరిగి అగాధంలోకి పడిపోయారు. సేనాధిపతి ధీరసేనుడు క్షమించమని ఆదిత్యుణ్ణి ప్రార్థించాడు. ఆదిత్యుడు, రాజగురువు అతన్ని వెంటబెట్టుకుని సూర్యపురికి వెళ్ళాలని నిర్ణయించారు.

ఆదిత్యుడు భటుణ్ణి పిలిచాడు.






















గురుదేవా నాకు సెలవివ్వండి. ఆలయ పునర్నిర్మాణ పనులు మీరే చూసుకోవాలి. త్వరలో తిరిగివస్తాను.
వెళ్ళిరా నాయనా! సూర్యపురితో స్నేహం చేసుకుని తిరిగిరా!


ఆదిత్యుడు గుర్రాన్ని అధిరోహించబోతూండగా ఒక డేగ వచ్చి ఆయన భుజం మీద వాలింది.




నువ్వు నన్ను హెచ్చరించడానికి వచ్చావా?


ఇది శుభశకునం ఆదిత్యా! గరుడభగవానుడు నిన్ను ఆశీర్వదిస్తున్నాడు.
చుట్టూ రక్షాకవచం ఏర్పరుస్తున్నట్టు డేగ ఆదిత్యుడి తల మీదుగా వృత్తాకారంలో తిరగసాగింది.


సూర్యాస్తమయం అవుతూండగా ఆదిత్యుడూ, ధీరసేనుడూ సూర్యపురి కోటను సమీపించారు.




యువరాజు ఆదిత్యుడికి నమస్కారం! సూర్యపురి రాజు, ప్రజల తరపున స్వాగతం! సుస్వాగతం!
మిత్రరాజ్యానికి రావడానికి నాకెంతో సంతోషంగా ఉంది.


ధీరసేనుడు ఒక భటుడి కేసి తిరిగాడు.
చంద్రపురి యువరాజు ఆదిత్యుడు మన గౌరవనీయమైన అతిథి.
సేనాధిపతి ధీరసేనా....


...మీ రాజుకు నా
నమోవాకాలు తెలియజేయాలని
ఆశిస్తున్నాను.
రండి. రాజు సముఖానికి
వెళదాం.

రాజు రాఘవేంద్రుడి భవనంలోకి
వెళ్ళారు.

నిన్ను చూడడం నాకెంతో
ఆనందదాయకం. అనారోగ్యం
కారణంగా నీ పట్టాభిషేక
మహోత్సవానికి రాలేక
పోయాను.
ప్రభూ! అది వాయిదా
పడింది. నేను ఇక్కడికి ఎందుకు
వచ్చిందీ సేనాధిపతి ధీరసేనుడు
వివరించగలడు.

ధీరసేనుడు వివరించాడు.
ప్రభూ! సూర్యపురి, చంద్రపురికి
అండగా నిలబడాలి.
తప్పకుండా
సాయపడతాం

ధీరసేనా, మన సేనలను
సర్వసన్నద్ధంగా ఉంచు.
అయినా, యుద్ధానికి అవసరం
ఉండదనే భావిస్తున్నాను.

సూర్యపురితో మైత్రి పొందడం
చూసి మా మహారాజు పరమానందం
చెందగలరు, ప్రభూ!
నేను మన
అతిథిని విడిదిగృహానికి
తీసుకువెళ్ళి, తరవాత
వ్యూహాల గురించి
చర్చిస్తాను.

చాలా దూరం ప్రయాణం
చేసి వచ్చావు. వెళ్ళి విశ్రాంతి
తీసుకో యువరాజా.
నేను వెళ్ళే ముందు
మిమ్మల్ని మరోసారి వచ్చి
కలుస్తాను ప్రభూ!

మీరిక్కడ విశ్రాంతి తీసుకోండి.
నేను మా దళనాయకులతో మాట్లాడి,
మన వ్యూహరచన వివరాలతో తిరిగి
వస్తాను.
నేను మీ కోసం
ఎదురుచూస్తుంటాను.

ధీరసేనా! లేనిపోని
లాంఛనాలకు వెళ్ళవద్దు.
యువరాజా!
తమరిప్పుడు మా
అతిథి!


అక్కడ కొండగుహలలో కేకలు విని కోయభటులు పరిగెత్తుకువచ్చారు.
రవీంద్రా! నువ్వెక్కడున్నావు? తక్షణమే ఇక్కడికి రా!
మేము వెళ్ళి, ఆయన్ను తీసుకువస్తాం దొరా!


ఇది అర్ధరాత్రి సమయం నాన్నా! నన్నెందుకు పిలిచారు?
ఆ భూతవైద్యుణ్ణి పిలుచుకురండి. అతడిప్పుడు ఇక్కడికి రావాలి. అతడు వచ్చాక ఎందుకు పిలిచానో చెబుతాను.


భూతవైద్యుడు వచ్చాడని చెప్పారు.
నువ్వు నాతో ఏమైనా చెప్పాలనుకున్నావా?
రవీంద్రదేవుణ్ణి గురించి చాలా విచారంగా ఉన్నది. నాకో కల వచ్చింది.


...ఆ కలలో డేగల గుంపు అతన్ని ఎత్తుకుని ఎటో ఎగిరి వెళ్ళిపోయాయి.


మరో డేగల గుంపు నాగబంధు చితాభస్మం ఉన్న పాత్రను పట్టుకుపోయాయి!
-(ఇంకావుంది)

# మహాబలిపురం



చెన్నయ్ నగరానికి దక్షిణంగా దాదాపు 60 కి.మీ. దూరంలో జగత్ప్రసిద్ధి గాంచిన మహాబలిపురం ఉన్నది. పల్లవరాజుల కాలంలో (క్రీ.శ. 3-9 శతాబ్దాలు) ఇది గొప్ప రేవు పట్టణంగా ఉండేది. ఇక్కడి నుంచి కంబూజ (కంబోడియా) శ్రీవిజయ (మలేసియా, ఇండోనేసియా) చంపా (అన్నమ్) దేశాలతో వర్తక వ్యాపారాలు సాగేవి. కాంచీపురం రాజధానిగా పాలించిన పల్లవులు, మహాబలిపురాన్ని రెండవ రాజధానిగా చేసుకున్నారు. మొదటి నరసింహవర్మ, రెండవ రాజసింహ నరసింహవర్మ కాలాన్ని (క్రీ.శ. 650-750) పల్లవుల స్వర్ణయుగంగా పేర్కొంటారు. ఆ తరవాత తీరనగరం సముద్రంలో మునిగి పోయిందని చెబుతారు. పల్లవుల శిల్పకళా ప్రతిభకు, పోషణకు అద్భుత సాక్ష్యాలుగా ఈనాటికీ గుహాలయాలు, ఏకశిలా రథాలు నిలిచి ఉన్నాయి. అవి ఉభయ నరసింహవర్మల కాలంలోనే నిర్మించబడ్డాయి. శిలలలో ఏర్పరచిన విష్ణు మందిరం, గంగావతరణ ఘట్టం, అర్జునుడి తపస్సు, మహిషాసుర మర్దిని రూపం, మొదలైనవి చూపరులకు ఆనందాశ్చర్యాలు కలిగిస్తాయి. పంచపాండవుల రథాలు, సముద్ర జలాలను ఆనుకుని ఉన్న తీర ఆలయం చాలా ప్రసిద్ధి చెందాయి.

మొదటి నరసింహవర్మ గొప్ప యుద్ధవీరుడు. ఆయన గౌరవార్థమే దీనికి 'మామల్లపురం' అనే పేరు వచ్చింది.

1984వ సంవత్సరంలో ఇక్కడి మొత్తం ఆలయాలు, శిల్పాలుగల ప్రాంతం ప్రపంచ వారసత్వ ప్రదేశంగా ప్రకటించబడింది.



## ఏడేళ్ళ వయసులో అంతర్జాతీయ రేటింగ్

ఢిల్లీలోని రఘుబీర్‌సింగ్ మోడర్న్ స్కూల్లో మూడవ తరగతి చదువుతున్న హర్షాల్ షా, మన దేశంలో అంతర్జాతీయ రేటింగ్ పొందిన అతిపిన్న వయసు చెస్ ఆటగాడు అయ్యాడు. 2006 డిసెంబర్‌లోనే అతడు అన్ని ఫార్మాలిటీస్ పూర్తి చేసినప్పటికీ, ప్రపంచ చెస్ సంస్థ 'ఫైడ్' గత మే నెలలోనే తన నిర్ణయాన్ని ప్రకటించింది. ఇప్పుడు హర్షాల్ షా వయసు వివరాలను ఆ సంస్థ రికార్డులలో నమోదు చేసుకున్నది. పరిమరాజ్ నేగి (2002), సహజ్ గోవర్ (2003) తరవాత, హర్షాల్ దేశంలో అతి పిన్నవయసు ఆటగాడుగా స్థానం సంపాదించాడు.

## అద్భుతమైన జ్ఞాపకశక్తి

ఒక మూడేళ్ళ పసివాడి కారణంగా ఇవాళ కాలిఫోర్నియాలోని సన్నీవేల్ చాలామందికి ముఖ్యంగా, యూట్యూబ్ వెబ్‌సైట్ చూసేవారికి పరిచితమయింది. భారతీయ సంతతికి చెందిన మాధవకృష్ణ అనే ఈ మూడేళ్ళ బుడతడు అద్భుతమైన జ్ఞాపకశక్తిని కనబరుస్తున్నాడు. అమెరికాలో 50 రాష్ట్రాల రాజధానుల పేర్లూ, సునాయాసంగా చెప్పగలుగుతున్నాడు. అంతేకాదు. యూరపు, ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని అనేక రాజధానుల పేర్లను కంఠతా పట్టాడు. 'అమెరికన్ ప్లెడ్జ్ ఆఫ్ అలీజియన్స్'ను అలాగే అప్పగించడంతో పాటు అమెరికా రాష్ట్రాల మారుపేర్లు కూడా చెప్పగలుగుతున్నాడు. కఠినమైన పదాల స్పెల్లింగులు చక్కగా చెప్పగలుగుతున్నాడు. ఈ మూడేళ్ళ వయసువాణ్ణి బాలమేధావి అని మెచ్చుకోకుండా ఉండలేం కదా?







# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :



### జిగురు కథ

చ్యూయింగ్ గమ్ నమిలే వారిని ఎవరిని అడిగినా అది మానసిక ఒత్తిడిని తగ్గిస్తుందని చెబుతారు. చ్యూయింగ్ గమ్‌కు శతాబ్దాల చరిత్ర ఉందంటే మీకు ఆశ్చర్యం కలగవచ్చు. ప్రాచీన గ్రీకులు, మెక్సికోకు చెందిన మాయెన్స్, చెట్ల నుంచి తీసిన రకరకాల జిగట పదార్థాలను గమ్‌లాగా నమిలేవారు.

అయితే ప్రపంచంలో వ్యాపారరీత్యా 'స్టేట్ ఆఫ్ మైన్ ప్యూర్ స్ప్రూస్ గమ్' అనే గమ్‌ను 1848లో జాన్ బి. కర్టిస్ తయారుచేశాడు. థామస్ ఆడమ్స్ చిక్లెట్‌ను కనుగొన్నాడు. ఒకనాడు వాళ్ళ ఇంటికి జనరల్ ఆంటోనియో డీ అన్నా అతిథిగా వచ్చాడు. చికిల్‌ను ఉపయోగించి చౌక సింథెటిక్ రబ్బర్‌ను తయారు చేయమని సలహా ఇచ్చాడు. ఆయన ఫ్యాక్టరీ స్థాపించి ప్రయోగాలు ప్రారంభించాడు. ఆయన ఒక షాపు వద్ద ఉండగా ఒక చిన్నమ్మాయి వచ్చి, చ్యూయింగ్ గమ్ కొనడం చూశాడు. చికిల్ నుంచి కాక ఇతర పదార్థంతో తయారుచేసిన గమ్‌ను అమ్మగలవా అని ఆయన షాపు యజమానిని అడిగాడు. ఆయన అంగీకరించాడు. ఆడమ్స్ చ్యూయింగ్ గమ్‌ను తయారు చేసి దానికి 'న్యూయార్క్స్ నం. 1' అని పేరు పెట్టాడు. అవే మొదటి చిక్లెట్స్.

## మన పరిసరాలు



### సీతాకోకచిలుక నుంచి ప్రేరణ

కొత్త, వాటర్ ప్రూఫ్, సెల్ఫ్ క్లీనింగ్ పదార్థాన్ని తయారు చేయడానికి 'మార్ఫో సుల్కోస్‌స్కీయ్' సీతాకోకచిలుక మెరిసే నీలిరెక్కలు ప్రేరణ కలిగించాయి. జపానుకు చెందిన కనగావా అకాడెమీ ఆఫ్ సైన్స్ ఈ అద్భుతమైన పదార్థాన్ని తయారు చేయడానికి ప్రయత్నిస్తున్నది. ఈ అద్భుత పదార్థం దుమ్ము, ధూళి, మురికి అంటకుండా వస్తువులు సహజంగా నిగనిగలాడేలా చేస్తుంది. సీతాకోకచిలుక రెక్కల మీదున్న అసంఖ్యాకమైన మైక్రోస్కోపిక్ పొలుసుల వరసలు నీటిని అంటకుండా చేస్తూ మెరిసే నీలి రంగును సృష్టిస్తాయి. దొర్లి పడిపోయే నీటి బిందువులు తమతో దుమ్మును, ధూళిని తీసుకువెళ్ళడం వల్ల రెక్కలు ఎప్పుడూ శుభ్రంగా నిగనిగలాడుతూ కనిపిస్తాయి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జనవరి 2008 సంచికలో ప్రచురిస్తాం.

ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

శ్రద్ధ పులిజాల
తం.పే. పి. శ్రీనివాసరావు
ఫ్లాట్ 64, విష్ణు చైతన్య అపార్ట్‌మెంట్స్
మౌలాలి, హైదరాబాద్ - 500 040
(ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : శుభ్రతను పాటిస్తే...!
రెండవ ఫోటో : శునకం కూడా వేస్తమే!!

## సమాధానాలు :

1. ఋషభదేవుడు; 2. పాలీ; 3. ఆయన శాక్యవంశంలో జన్మించడంవల్ల; 4. దిగంబరులు; 5. హీనయాన, మహాయాన, వజ్రయాన.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)

# బాల్యం నుంచి మేము పెరిగింది
# ఆంధ్రాబ్యాంక్ యొక్క కిడ్డి బ్యాంక్ తో

## ప్రస్తుతం మా పిల్లలు కూడా అలాగే పెరగాలని కోరుకుంటున్నాము.




ప్రత్యేకించి పిల్లల కోసం, పిల్లల ప్రత్యేక పొదుపు పథకం **"ఎబి కిడ్డి బ్యాంక్"** ను ఆంధ్రాబ్యాంక్ వారు పునఃప్రవేశపెడుతున్నారు.

ఈ పథకం ప్రత్యేకమైన బొమ్మతో పాటు అనేక ప్రత్యేకతలను కలిగియున్నది.

నేడే మీ పిల్లల కోసం ఈ ఖాతాని ప్రారంభించి, చిన్న వయస్సులోనే వారిలో పొదుపు అలవాట్లను నేర్పించండి.

**ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक ANDHRA BANK**

(భారత ప్రభుత్వ సంస్థ)

**Much more to do, with YOU in focus**

CHANDAMAMA (Telugu) Nov 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08